కొన్ని పురుగులు ఒకచోట చేరి, సభచేస్తున్నాయి. "మన పేడ వేరు, మన జాతి వేరు. మనం చాలా తెలివిగలవాళ్ళం, ప్రతిభావంతులం. ఈ పేడంతా ఒకటే, పురుగుజాతి అంతా ఒకటేనని అబద్ధాలు చెప్పి, మన ఐశ్వర్యాన్ని, మన భాషని, మన సంస్కృతినే అణగదొక్కుతున్నాయి. పక్కనున్న నల్లపురుగులు, అవి పేడని వుండలుగా చేసుకునిగాని తినవు. అవి పురుగు జాతికి కాళ్ళు అవసరమంటాయి. మనం ఎట్లానన్నా సత్యాగ్రహం చేసి ఐనా సరే విడిపోవాలి" అంటూ వుండగా పైనించి ఆవు వుచ్చపోసింది. ఆ ధారతో ఆ దేశమంతా జలమయమయింది. వెంటనే మిగిలి బతికిన ఒక జడలపురుగు, "ఈ వరదలు మన తాతలుచేసిన పాపాలకి ఈశ్వరుడు కోపించి చేసిన ప్రతీకారం. ఇంకనన్నా యీ భేదత్వాన్ని మాని సమత్వానికి రండి" అంటున్నాడు.

కాని ఒక తెల్లని గడ్డంపురుగు, "ఇదేమి మూర్ఖం, మన తాతలు చేసినదానికి మనమీద కోపం కలుగుతుందా ఈశ్వరుడికి? ఇంతకాలం పట్టిందా అతను తెలుసుకుని కోపించడానికి? అదేదో నీటిధార పడ్డది. శాస్త్రజ్ఞులు దానికి కారణం కనుక్కోగలరు!" అన్నాడు. ఆ మాటలకి పురుగుజాతికి కోపమొచ్చి, ఆ గడ్డంపురుగుని మోసుకుపోయి గట్టిపేడలో వూపిరాడకుండా పాతి చంపేశాయి.

ఒకమూల ఓ గుంపు పోగయింది. ఓ వంకర్ల ఆడ పురుగు ఎక్కడో ఓ దారాన్ని సంపాయించి చుట్టుకుంది. కొంచెం బాగా తెలుపుగా పాచిపట్టిన పేడని మొహానికి రాసుకుని, మూతికి కొంచెం రక్తపు చుక్కని అంటించుకుని, చేతులో ఓ చీకిన ఆకుముక్కని వేళ్ళాడేసుకుని, కులుకుతో తిరుగుతోంది. వెంటనే మొగపురుగులన్నీ, "దేవతా, ఏ లోకం నించి వొచ్చావు? ఏ సౌందర్య సందేశాన్ని తెచ్చావు? నిన్నే విధంగా మేము ఆరాధించగలం!" అని సాష్టాంగపడ్డాయి. నాలుగైదు కవి పురుగులు ఆమె మీద పద్యాన్ని రాసుకుంటో వెంటపడ్డారు. ఇంతలో ఆమెని తక్కిన ఆడపురుగులు చూసి, "ఇది రాక్షసి, విపరీతం, దీన్ని నిలువునా చీల్చేస్తాము" అని మీదికి దూకాయి. వృద్ధపురుగులు "ఇట్లాంటి

స్త్రీ పురుగుల విపరీత వేషాల వల్ల నే ఆయువు తగ్గింది, పేడకి రుచి పోతోంది, పేడ కంపాలు కలుగుతున్నాయి" అని అరుస్తున్నాయి. కాని యువకపురుగులన్నీ నవీనపురుగును రక్షించి ఆమెని తమ యిళ్ళకి ఆహ్వానించారు. ఆమెని రక్షిస్తామని శపథాలూ, ప్రమాణాలూ పట్టారు. ఒకరి కన్న ఒకరు ఆమెకి ఎక్కువపేడనీ, చీకిన అకుల్నీ, దారాన్నీ వాగ్దానం చేసి ఆమెని వేలం వేసుకుంటారు. కాని ప్రతివారూ ఎట్లాగన్నా ఆ దారాన్ని తొలగించి, ఆ దారం వెనక ఏముందో చూడాలని చాలా తహతహ పడ్డారు. పక్కనున్న చిన్న కుప్పలోంచి ఓ బొండుపురుగు చూసింది. ఆ నారీ పురుగుమణిని, తటాలున దూకి యువక పురుగుల్ని తన్ని ఆమెని ఎత్తుకొనిపోతోంది. మొదట్లో ఆ దారపు పురుగు "హా, హా, రక్షించండి" అని అరిచింది. కాని త్వరలోనే బొండుపురుగుని కావిలించుకొని ముద్దులాడింది. ఆ సంగతి తెలీక ఆమెని ఎత్తుకుపోవడం దౌర్జన్యమనీ, తమ జాతికే అవమానమనీ, యీ పురుగులన్నీ దండెత్తడానికి యుద్ధసన్నాహాలు చేసుకుంటున్నాయి.

ఇంకొకచోట ఒక పెద్ద సభ జరుగుతోంది. అఖిల సారస్వత సమ్మేళనం. దాంటోకి చాలరకాల వింతపురుగులన్నీ వొచ్చాయి. ఒక మూల ఒక సంపాదకీయ పురుగు ఒక చచ్చిన చిన్న పురుగుమీద నుంచుని ఉపన్యాసం యిస్తోంది.

"ఈ పురుగు పేడ వాంగ్మయానికి చాలా సేవచేసింది. ఈ పురుగుకి మనం ఒక్క సన్మానమూ చెయ్యలేదు. ఇప్పుడు మనం విరాళంగా చందాలిచ్చి గొప్ప స్మారకచిహ్నం కట్టాలి. అందరూ నుంచోండి. ఈ పురుగు ఆత్మ ఊర్ధ్వలోకానికి పంపి శాంతి నివ్వాలని ప్రార్థిద్దాము" అంది.

కాని ఎవరూ నుంచో లేదు. పైగా గుసగుసలాడుతున్నారు సభాసదులు.

"చందాలన్నీ వీడే కొట్టెయ్యడానికి"

"అయినా ఆ కవిగాడికి ఆత్మశాంతి ఏమిటి? వాడు రాసినవన్నీ అవినీతి బూతు కథలే,"

"వాణ్ణి పొగడడానికి, వాడిలాంటివాడు వీడొకడు దొరికాడు."

అక్కడే ఓ ముసలిపురుగు కొంత పేడని పోగుచేసుకుని దానిమీద కూచుంది. దాని పాదాలముందు పిల్ల కవి పురుగులు తమతమ రచనల్ని అర్పించి, వరసగా చదువుతున్నారు. ఆ పురుగు తన యిష్టప్రకారం "ఈ కావ్యం తుక్కు. ఈ కావ్యం పదేళ్ళు నిలుస్తుంది. ఈ కావ్యం వెయ్యేళ్ళు నిలుస్తుంది" అంటోంది ఆడకవుల కావ్యాలు మాత్రం చాలా మెచ్చుకుని. ఆచంద్రార్కంగా నిలుస్తాయని దీవించి, తన పీఠం మీద కూచోపెట్టు కుంటోంది అందమైన పురుగుల్ని.

ఇంతలో అక్కడికి పెద్దపెద్ద జెండాలతో అరుపులతో ఓ పురుగు గుంపు ప్రవేశించింది.

"లాగెయ్యండి వాణ్ణి కిందికి లాగెయ్యండి. ఇదంతా పేడ గలవారి సారస్వతం. దీనివల్ల నే సామాన్యులకి అన్యాయం జరుగుతోంది. ఈ పేడ నంతా ఒకటే తూనికగల ఉండలుగాచేసి పురుగులన్నిటికి సమానంగా పంచవలసినదే గాని, కొన్ని బలిసిన పురుగులు మాత్రం ఇట్లా గుట్టల కింద చేసుకుని దానిమీద కూచోడానికి వీల్లేదు. లాగెయ్యండి వాణ్ని కిందికి లాగెయ్యండి. వీళ్ళు రాసే గ్రంథాలూ, కవిత్వాలూ, ఎవరికీ అర్థం కావు. దేవుడూ, భక్తి, శృంగారం ఇట్లాటివే రాస్తారు వీళ్ళు. వీళ్ళనీ, వీళ్ళ కవిత్వాన్నీ ధ్వంసంచేస్తేనేగాని శాంతిలేదు లోకానికి. లాగెయ్యండి, వీళ్ళని" అని అరిచారు. అంతటితో ఆ అధ్యక్షుణ్ని కిందికి లాగేసి పడేసి, ఆ సభని చిందరవందరచేసి పోయినారు వాళ్ళు.

వాళ్ళు పోగానే తన ప్రియురాళ్ళతో కూడా పైకిలేచి దులుపుకుని, మళ్ళీ పేడని కుప్పచేసుకుని కూచుంది ఆ అధ్యక్ష పురుగు.

"పరవాలేదు, పరవాలేదు మహాపురుషులకి ఇలాంటి పతనాలు చాలా సహజం" అంది. వెంటనే కళ్ళు మూసుకుని బిగ్గిరిగా ప్రార్థన నారంభించింది.

"పరమేశ్వరా, నమస్కృతులు, బక్షించుటకు ఈ పేడను సృష్టించుటే గాక, అపారమైన దయతో, దీనియందు గొప్ప రుచిని కూడా ప్రసాదించియున్నావు. నేను సంసాదించుటకు నా పురుగు భార్యనూ, అధిక సంసారించుటకు అనేకమంది సుందరులైన ప్రియురాళ్ళనూ, నా ఆజ్ఞను పాలించుటకు పుత్ర పుత్రికలనూ ప్రసాదించినావు. కోళ్ళనించీ, కాకులనించీ, పెద్ద లద్దె పురుగుల నుండీ మమ్ము సర్వదా రక్షింపుము."

అనగానే పురుగులన్నీ ప్రార్థనాగీతా న్నందుకున్నాయి—

"పురుగూ పావనుడవూ నీవు. పురుగూ పాపులు మేము.

పేడా మాకు పెట్టామంటే, పెట్టక తన్నీవు!"

ఇంతలో పెద్ద పెద్ద జండాలు పట్టుకుని ఓ గుంపు ప్రవేశించింది. దాంటో ఒక్కపురుగు, ప్రార్థన చేస్తున్న సభాధ్యక్షుణ్ణి పక్కకి నెట్టి, గంభీరోపన్యాసం ప్రారంభించింది.

"సోదరీ, సోదరులారా, స్వదేశ మిత్రులారా, పురుగు మహారాజ్య ధుర్యులారా, నేనెవరో మీకు తెలపనక్కర్లేదు. ఈ ఎన్నికలలో మీ వోట్లన్నీ నాకే యివ్వాలి మీరు. నా పార్టీ విజయమందితే, నేను ప్రధాన మంత్రినై, యీ రాజ్యంలో దరిద్రమూ, ద్వేషమూ, బాధా ఏమీ లేకుండా, అందరికీ సమానమైన హక్కులిన్నిచ్చి, నేను రామరాజ్యాన్ని స్థాపించబోతున్నాను. మనదేశము మహా పురాతనము? తక్కిన దేశాలన్నీ మొన్న పుట్టాయి నిన్న నశించాయి. కాని యీ పురుగు దేశముందే యిదీ దేవతలు స్వయంగా నిర్మించుకున్న భూమి. దీనికి పతనం లేదు. ఇదీ అనంతకోటి యుగాల వరకు ప్రపంచానికి జ్యోతియై వెలగాలంటే, నాకు మీ వోట్లు ఇవ్వండి...." అని ముగించగానే పురుగులన్నీ "మోయించు జయభేరి, వాయించు నగారా" అని ఒకదానిమీద ఒకటి దబదబ బాదడం ప్రారంభించాయి.

ఇంతలో జయలక్ష్మి స్నానంనీళ్ళు పేడకుప్ప చుట్టూ పెద్దమడుగు కడుతున్నాయి. పేడ నాని పెళ్ళపెళ్ళలుగా ఆ నీళ్ళలో కూలిపోతోంది

పురుగులు ఆ నీళ్ళలోపడి కొట్టుకుపోతున్నాయి. బతికివున్న పురుగులు పళ్ళూ, కుంకం, కొబ్బరికాయలూ పళ్ళాలు పట్టుకు వెళ్ళి, ఆ నీటి ప్రవాహానికి పూజలు చేశాయి.

ఆ ప్రవాహాన్ని, స్వర్గనది అనీ, ఆ సురుగుని పవిత్ర పాదోదక ఫేనమనీ, ఏదో జటా జూటంలోంచి కారుతోందనీ వర్ణించి, దాంటో స్నానాలుచేసి, పాపాలు పోయినాయని చెప్పుకుంటున్నాయి.

ఒక పురుగు— "ఛా ఇది వుత్త బురద నీళ్ళు." అంటే తక్కిన పురుగులు "ఓరి మత భ్రష్టుడా, పాషండుడా, వుత్త నీళ్ళకి ఈ సుగంధ మెక్కడినుండి వొస్తుంది?" అని ముక్కులతో పొడిచి దాన్ని నీళ్ళ లోకి తోసేశాయి.

"ఇదేమిటి ఈ తుచ్ఛపు అవిశ్వాస పురుగుని ఈ పవిత్రవాహినిలోకి తోశారు? దానికి సద్యోమోక్షం వొచ్చేస్తుందే!" అని ఏడ్చాయి కొన్ని పురుగులు.

ఆ నీటిప్రవాహంలో స్నానంచేసి కొన్ని ఆడపురుగులు ఒకచోట చేరి ఒక సభ చేశాయి. ఒక పురుగు ఆ నీళ్ళలో తిలోదకాలు వొదిలి.

"మన కష్టాలకై పరితపించి, ఈ మొగ పురుగుల నిరంకుశత్వా న్నించి మనని తప్పించడానికై సారస్వతం ద్వారా పాటుపడ్డ ఆ మహా పురుగుకి మనం యీవాళ యీ అర్పణ చేస్తున్నాము" అంది.

"ఏదీ, ఆ పురుగు?" అన్నాయి కొన్ని కంఠాలు.

"లేదు. తన ఆత్మని శాశ్వతం చేసుకోడం కోసం దక్షిణంగా పర్వతాలలోకి పోయింది" అన్నారు కొందరు.

అన్ని పురుగులూ లేచి నుంచునీ పాటలు పాడి ఆ పురుగు ఆత్మ శాంతికై ప్రార్థించాయి.

ఆ నీటి వొడ్డున కొన్ని పురుగులు తగాదాలో పడ్డాయి.

"పేడ తినాలిగాని, దానిలోని చిన్న తెల్లని పురుగుల్ని తినడం మహాపాతకం" అంటాయి కొన్ని.

రెక్కలున్న పురుగుల్ని తినకూడదని కొన్నీ, నీళ్ళలో దొరికే పురుగుల్ని తినకూడదని కొన్నీ వాదించాయి.

"అసలు పచ్చి పేడనేగాని మగ్గిన పేడని తినకూడ"దని కొన్ని పురుగులు బోధిస్తున్నాయి. అదే ఆరోగ్యకరమనీ, పచ్చిపేడని వుండలు వుండలుగాచేసుకుని, నిర్ణయంగా రోజుకి ఓ వుండని మింగితే పురుగులు రెండువందల ఏళ్ళు బతుకుతాయనీ, రోగాలూ, వుప్పెనలూ, వ్యభిచారాలూ విప్లవాలూ, మగ్గిన పేడ తినడం వల్లనే కలుగుతున్నాయనీ రూఢి చేశాయి.

పేడరసాన్ని పులిపించి తాగడంవల్ల చాలా ఘోరాలు తటస్థిస్తున్నాయనీ పులవపెట్టకండా తాగితే వొంటికి మంచిదనీ, పేడ మద్యాన్ని నిషేధించమని ప్రభుత్వానికి అర్జీలు పెడుతున్నాయి కొన్ని పురుగులు.

కొన్ని పురుగులు పేడని అణువులకింద విడిగొట్టి పేడ అణువు స్వరూపాన్ని తెలుసుకుంటే సృష్టిరహస్యం అర్థమౌతుంది అంటున్నాయి.

ఒక కాషాయపు పురుగు,

"నేనే పరమేశ్వరుణ్ణి. ఇదంతా లీల. నేనే కర్తను, కర్మను, క్రియను. నేనే గీతం. నేనే భావం" అంటోంది.

ఇంతలో జయలక్ష్మి దాసీది వొచ్చి పొయ్యి అలకడానికి ఆ పురుగుల్ని చూడకుండా, ఆ పురుగులున్న పేడనంతా ముద్దచేసి తీసుకు పోయింది.

ఆ ముద్దకిందనించి రెండు తెల్లటి పురుగులు బైటపడ్డాయి. ఒకదానికి జయలక్ష్మి మొహం, ఇంకోదానికి నా మొహం. రెండూఒకదానితో ఒకటి పెనవేసుకుంటున్నాయి. అది పోట్లాటో మోహమో తేల్చుకోలేక పోయాను. వాటి దగ్గిరగా ఓ నల్లటి కాకి వాలింది. దాన్నిచూసి ఆడపురుగు భయపడి, మొగపురుగు వెనక దాగింది. ఆ కాకి తన మీదికి వొస్తుందేమోనని ఆడపురుగుని ముందుకునెట్టి మొగవాడు ఆకులకింద దూరాడు. ఇంక దిక్కులేక ఆడపురుగు పెళగడం ప్రారంభించి నిమిషంలో జయలక్ష్మిగా

మారింది. వెంటనే పేడకుప్ప నాకళ్ళముందు మాయమై ప్రపంచం మామూలుగా ప్రత్యక్షమయింది. జయలక్ష్మి తలలో కదంబం, గులాబి పువ్వులు పెట్టుకుని, స్నానం పరిమళాలతో, ఆకుపచ్చ వెంకటగిరి చీర కట్టుకుని, నవ్వుతోంది నన్ను చూసి.

"ఆరాధన అయిపోయిందా?"

నేను చూసిన దృశ్యాలు నా మనసునించి తప్పిపోలేదు.

"ఏం బతుకు మనది? ఏమిటి అర్థం?"

"ఈ తగాదాలేనా? అదే నేనూ అడగాలనుకున్నాను."

"తగాదాలు కాదు, అసలు ఈ ప్రేమ."

"బతుక్కీ ప్రేమకీ కూడా అర్థం కనపట్టం లేదా మీకు?"

"ఏమిటో యిప్పుడు పుట్టి రేపు నశించే పురుగులం."

"కాని ఈ రాత్రికి దేవతలం. ప్రేమలో అమృతులం, లోపలికిరా."

"నేను రాను. బొంబాయి వెడుతున్నాను రాత్రికి."

"నేనే తీసుకుని వెడతానుగా నిన్ను!"

"ఎక్కడికి?"

"బొంబాయిని మరిపించే దివ్యనగరానికి."

"నేను బొంబాయే వెడతాను."

"వెళ్ళి?"

"వెళ్ళి నిన్ను మరిచిపోతాను."

"నన్నూ-నిన్నూ మరిపింపచేస్తాను."

"పోట్లాడతావు నాతో."

"నా పోట్లాట మాత్రం ఏం శాశ్వతం? ఎందుకంత బాధగా తీసుకోవాలి నువ్వు? ఏదో రేపు పొద్దున్నకి నశించేవాడివి? పద."

రెండు పురుగులూ గూట్లోకి వెళ్ళాయి.

# పతివ్రత

రైల్లో అంతా యోచనేలేదు. అలిసిపోయినాడు. టైఫాయిడ్ జ్వరం. ఇంకా పూర్తిగా నయమై పత్యంకూడా తీసుకోలేదు. సుశీలరాసిన ఉత్తరం చదివాడు. తనకి సరిగా తెలీనుకూడా తెలీదు బయలుదేరుతున్నానని. దుర్గతో చెప్పనన్నాలేదు. తను రైల్లోంచి రాసిన ఉత్తరంతో తెలుసు కుంటుంది? కాని ఏం తెలుసు కుంటుంది? తనేం రాయగలిగాడు? తనకి మాత్రం ఏం స్పష్టం? ఇప్పటికైనా ఎట్లా తెలుసు తనకి ఎందుకు బైయలుదేరాడో! చెప్పినా ఎవరికర్థమౌతుంది! పరాయి మొగాడితో కాపరమున్న సుశీల దగ్గిరికి తను ఎందుకు బైలుదేరాడో!

అంతా అడివి. ఏదో "పాలెం", జేబులో ఉత్తరం. దాంటోవుంది చిరునామా? అది బండీ వాడికి చెప్పాడు. సాయంత్రానికి చేరుకుంటా మన్నాడు. రాత్రయిందీ, ఎంతకీ ఇదుగో అదుగో అంటాడు. ఆకలిగా కూడా వుంది. ఎప్పటికి? సుశీలనించి ఆ వుత్తరం వొచ్చిందాకా ఆమె బతికి వుందనేతెలీదు తనకి! ఎన్నేళ్లు? పదేళ్ళ? ఇప్పుడెట్లావుందో! మరి తను రావడం ఇష్టపడుతుందా? ఈ అడివిలో ఎవరో మొగవాడితో కాపరం వుండి వుంటుంది? అతను వొప్పుకుంటాడా? సుశీల వుంటుందిగా. ఫరవాలేదు. పొమ్మంటుందా? ఈ అడవిలో పొమ్మంటే తానేం కాను?

దుర్గని భరించలేకపోతే పోనీ, ఈ సుశీలదగ్గిరికి ఎందుకు? ఎందుకో ఎవరికి తెలుసు?

చుట్టూ చీకటి, ఎప్పటికీరాదా ఆవూరు? వూరుదాటాం అన్నాడు ఇందాక, మరి ఇంకా ఎంతదూరం? ఏవో జంతువులు అరుస్తున్నాయి, పెద్దపుల్లు కావుకదా!

అవును. దుర్గనించి రెండుసార్లు పారిపోయినాడు తను. కాని రెండుసార్లూ తీసుకొచ్చింది వెనక్కి, ఎందుకుతీసుకుపోనిచ్చాడు తనని! తనకి ఇష్టమే. తీసుకుపోవాలనే వుంది తనకీని. వొంటరిగా బతకలేడు. డబ్బింతేనేం? తనవాళ్ళనే వాళ్లు లేకపోతే! పిల్లలూలేరు మరి! ఎందుకు పుట్టలేదో! అందుకనే ఈ సుశీల తప్ప గతి లేక, జరం బలహీనంలో వొళ్ళుతెలీక, ఆ వుత్తరం చూసి బైలుదేరాడు. వుత్తరంలో తనని రమ్మనిలేదే? ఎందుకు రమ్మంటుంది? తనెందుకు సుశీలకి? ఇప్పుడు? ఎప్పుడుమాత్రం తనెందుకు సుశీలకి? కాని ఏం ప్రేమగా వుండేది? ఎంత సేవచేసేది? దుర్గ కనక తనని అట్లా ఉపేక్షచేసిందిగాని సుశీల ఐతేనా! అన్నిరోజులూ తనపక్కన కూచోదా రాత్రింబగలు! వుండనీ ప్రియుడు వుంటేనేంగాక. తనని వొక్క నిమషం వొదిలేదా? తన తరవాతనే ఏ ప్రియుడైనా? తన నడుంపోటు రోజుల్లో దూలానికి తాళ్ళు కట్టుకుని నడుం తొక్కేది రాత్రంతా. అలిసి పడిపోకండా తాళ్ళు పట్టుకుని. ఆ రుణం ఎన్నడన్నా తీర్చుకోగలడా? తెల్లారకట్ట తను నిద్రపోయేప్పుడు, తోటలో జూకా పొదకింద ఆ కంసాలి అతనితో పడుకునేదట. అన్నారు అట్లా. నిజమో కాదో! సుశీలే నిజమని అందిగా! నిజమైతేనేం? ఎప్పుడూ తను సుశీలని తలుచుకుంటాడనీ, ఆమె ఫోటోని ఎదురుగా పెట్టుకున్నాడనేగా ముఖ్యమైన కోపం దుర్గకి. దుర్గకి గర్వం. పాతివ్రత్య గర్వం, సుశీలని తప్పుడుమాట లంటుంది. డబ్బుగర్వం. గొప్పఇంటి బిడ్డనని గర్వం. తనకోసం చేసిన త్యాగాలు చెప్పుకుచెప్పుకు గర్వం. ఎన్నడన్నా సుశీల ఒక్కనాడు అందా తనుచేసిన సేవసంగతి! తను ఆమెని వెళ్ళకొట్టిన రోజున అన్నా? ఎంత బుద్ధిహీనుడు తను! సుశీలని వెళ్ళకొట్టిన దౌర్భాగ్యుడు! ఆమె ఇంటికే వెడుతున్నాడు మళ్ళీ! మరి ప్రజలగోల పడలేక పొమ్మన్నాడు సుశీలని. చాలా ఏడ్చింది పాపం! ఆమెకోసం కాదేమో, ఆ విచారమంతా తన కోసమేనేమో!

బండీ ఆగుతోంది. ఎందుకు? అడగడానికి నోటమాటరాదు. నీరసం, ఈ అడవిలో ఆగిపోతుందా? తోవతప్పిపోయినారా? మాటలు.

ఎవరు? అంటున్నారు? దీపం కూడానూ. ఎవరు? ఆకలి! గుండెదడ! ఎవరు? ఏమిటా మాటలు?

చీకటి-చీకటి?

*　　*　　*

కలా! నిజమా? ఎక్కడవున్నాడు తను? ఎవరిది? సుశీల! సుశీల ఎట్లావొచ్చింది? చచ్చిపోయింది గావును. తన పక్కనకూచుంది.

"సుశీలా," కాని గొంతులోంచి చప్పుడు వినపట్టంలేదు. చచ్చిపోయి నాడు నిజంగానే! సుశీల చచ్చిపోయి ఎంత అందంగా వుందో! ఈ లోకంలో మాటలు వుండవుగావును! తన బాధ అంతా ఏమయింది? దేహం వుంటుందా? తనకి వొళ్ళూ చేతులూ కనపడుతున్నాయి.

"సుశీలా!"

పలకదేం? తను పిలవందే! మాట వినపడందే! స్వర్గమా ఇది? నరకమా? ఈ పెద్ద అడివి? పిట్టల అడావిడి. పువ్వులు చిన్న ఎండగడ్డిలో. తమాషా అందాల నీడలు పచ్చగడ్డిమీద, ఏంలోకం ఇది! ఇక్కడ ఏం చేస్తారు? కాని తను అడివిలోకి బైలుదేరాడు కాదూ? సుశీలకోసం? చెట్ల మధ్య ఎవరో కదులుతున్నారు. బుజాల గొడ్డళ్ళతో. ఇక్కడా గొడ్డళ్ళు వుంటాయిగావును? ఏవో అంటోంది సుశీల. తనకి వినపడదు....

ఏదో పోస్తోంది తన నోట్లో: బావుంది. జావా! భూలోకం మళ్లేనే వుందే ఈ లోకం! తనచావువిని దుర్గ ఏమంటుందో! చాలా ఏడుస్తుంది గావును?

నిద్ర, నిద్ర మళ్ళీ.

మళ్ళీ కళ్ళుతెరిచేప్పటికి — తన పక్కన సుశీల. ఇంకా పిట్టలు ఈలలు వేస్తున్నాయి. ఏదో వుడుకుతున్నవాసన — సుశీల తన పక్కన చెయ్యిజాచాడు. దయగా తన చెయ్యిపట్టుకుంది. మాట్లాడుతోంది...

"నెమ్మదిగా వుందా?"

"సు—శీ—లా...."

"పడుకోండి. మాట్లాడకండి."

"వెళ్ళి....పో....కూ?"

"వెళ్ళను, పడుకోండి."

"చెయ్యి ఇట్లా తే."

చెయ్యీ చెయ్యీ కలిపి అతనూ సుశీలా అట్లా ఎగిరిపోయినారు. చీకటయింది. చెట్లనిండా మిణుగురు పురుగులు, ఆ కాంతుల్లోంచి ఎగురుతూ చెట్టుచివర కూచుని కిందికిచూస్తున్నారు. ఆకుల్లోంచి ఆకుకి నీలం వెలుతురు గీతలుగీస్తో మిణుగురు పురుగులు ఎగురుతున్నాయి. పైన నల్లని ఆకాశంనిండా మెరిసే చుక్కలు. కింద వెలుతురుజరీ మెరుపులచెట్టు ఏమిటి ఇంత అందం? ఎదురుగా గద్దగూడుగావును. ముక్కులు ముందుకు చాచుకుని పడుకున్నాయి మూడు పిల్లలు. వాటిని ఆవరించుకుని తల్లి గుడ్లిప్పిచూస్తో పక్కనే కొమ్మమీద హాయిగా తండ్రి. మిణుగురు పురుగులు ఆ పిల్లల ముక్కులమీద ఆడుకుంటున్నాయి. మెత్తని చిన్నసూగులో వాటి వీపుమీదనించి జారుతున్నాయి. "చూడు, చూడు" అంది తనచేతిని లాగుతో సుశీల.

అప్పుడే తెరుచుకుంటున్న ప్రతి పువ్వులోంచీ, చిన్న చిన్న కిన్నెరలు ఆశ్చర్యంగా, బైటికి వొచ్చి పువ్వురేకులమీద నుంచుని చూస్తున్నారు, పెద్దగా కళ్ళువిప్పి, మెరిసే రంగుల బట్టలు, నీలం, ఆకుపచ్చ, గులాబి, నారింజ, పసుపుపచ్చ, ఊదా, ఎన్నిరంగులు ఆ బట్టలు; బట్టల్లోంచే అందమైనవాళ్ళ మెరుస్తోంది. ఒకర్నివొకరుదూరంనించిచూస్తో నవ్వుతున్నారు. చెట్టుతొర్రల్లోంచి ఏవేవో వాయిద్యాలతో బైలుదేరారు పెద్దపెద్ద మీసాల గడ్డాల నవ్వుతెప్పించే మొహాల వాయిద్యంవాళ్లు. ఏదో ఎన్నడూవినని సంగీతం నృత్యం చేసుకుంటో, మిణుగురు గీతల మీద కొమ్మమీద నించి

జారుతో, ఒకరునొకరుకావిలించుకుంటో, వాదులుతో, బుజాలమీద చేతులు వేసుకుని వూగుతో పెద్ద కోలాహలం, ఆనందం, వడివడిగా రంగుల్లో రంగులు కలుస్తో విడిపడుతో.

"మనమూ వెడదామా, వాళ్ళల్లోకి?" అంది సుశీల.

సుశీల వంక చూశాడు. ఆమెకూడా కిన్నెరా? నవ్వుతోంది కళ్ళలోంచి.

"చూద్దాం ఏంలోకం అది?"

"ఏ లోకం? మన లోకమే. అసలు మనలోకం ఇది. అక్కడంతా అదో కల."

చంద్రుడు ఉదయిస్తున్నాడు. చెట్టులో కిన్నెరలందరూ ఎగిరిపోతు న్నారు. "లాపోదాం." సునాయాసంగా ఎగిరారు ఇద్దరూ. ఆ అడవిమీద నించి కిందరాత్రి. మృగాలు, పాములు, పిల్లులు, గోదురు కప్పలు, సివంగులు....చాలా కొద్దినిమషాల్లోనో, గంటల్లోనో—ఎగిరే గుడ్లగూబల, గబ్బిలాల మధ్యనించి వెడుతున్నారు. రాత్రిలో ఒకరినొకరు పిలుచుకుంటో, గాలి మధ్యలోనే అల్లర్లు చేసుకుంటో, సరసాలాడుకుంటో, ఎంతోమంది ఒక్క నిమషం మెరుస్తో మాయమౌతో....

సముద్రం. ఇసికమీద కొత్తప్రియుడి వేళ్ళమల్లే సందేహిస్తో పడు తోంది వెన్నెల, ఎదురుగా ఎర్రని చంద్రబింబపు రేఖ నేటి నీలంలోంచి లేచింది గంభీరంగా, గొప్ప అధికారంతో. ఒక కొన సముద్రంలో ఇంకో కొన ఆకాశంలో, ఇసికనిండా కిన్నెరకన్యలు, యువకులు, గంతులేస్తో, అల్లరిచేస్తో, దొల్లుతో, నవ్వులో, దూకుతున్నారు అలలమీద. అలలతో పైకిలేచి, చేతులు చేతులు కలిపి, అద్దంమల్లే మెరిసే సీటిమీదనించి జారుతున్నారు. అలల అడుగునపడి లేచి, అలల నురుగులో పైకి ఎగిరి, పడుతున్నారు. ఎంత ఆనందం? తానూ సుశీలా దూకారు సము ద్రంలో, నీరు తడపదు. వృత్తకాంతిలో తేలుతున్నట్టుగా వుంది. అలల

మీద బంగారుచారల్లో కావిలించుకుని దొల్లారు తానూ సుశీలా. ఎంత అందంగా కనపడ్డా, ఏ కిన్నెరా, తన సుశీలను పోలిలేదు. ఎంత నవ్వు ఆమె కళ్ళల్లో! ఎంతకాలమైనా ఇట్లాగే ఆడుకోవొచ్చా! ఆకలీ రోగమూ వుండవా? తెల్లవారదా? ఇంక పగలూ, ధ్యాసలూ, పనులూ వుండవా?

చంద్రరేఖ పైకి లేచింది. కాంతి తెల్లనయ్యింది. ఎగిరిపోతున్నారు అందరూ.

"పోదామా, మనమూ? తెల్లారుతోంది" అంది సుశీల.

"తెల్లారుతోందా?" అని తను భయంగా.

"తెల్లారితేనేం?" అని ఆమె ధీరంగా.

అట్లా ఆ ప్రియులతో కలిసి పోతున్నారు. మధ్యలో ఆకాశంలో కొంగలబారులమల్లే, వెడుతో కొత్త గుంపులు, కొత్తసంగీతాలు, కంఠాలు, నవ్వులు, కొత్తరంగులు, అందాలు.

తానూ సుశీలా చాలాపైకి ఎగురుతున్నారు. చుట్టూ ఏవో కంఠాలూ గానాలు.

తూర్పున ఎర్రనిచార, ఆ మెత్తని కాంతిని మెల్లిగా పడమట ఓ మబ్బు లాక్కుని ఆపింది. గుంపులు గుంపులుగా కూచుని ఒకరిమీద ఒక రానుకుని, ముద్దులుపెట్టుకుంటో, కళ్ళలోకి నవ్వుకుంటో కూచున్నారు. భూమిమీదికి కనపడేవేపుకన్న ఆకాశంవేపున అమితమైన శుభ తేజస్సుతో మెరుస్తున్నాయి మబ్బులు. క్షణక్షణమూ కాంతులు మారుతో, ఆ కాంతిలో లేచి ఎగిరిపోతున్నారు ఎక్కడికో చాలామంది, సుశీలవేపూ అతనివేపూ చేతులువూపుతో. చిన్న ఎండ వొచ్చింది. దూరంగా కొండచివరలా, తరువాత చెట్లమీదా, మైదానాల్లో నదులమీదాపడి ప్రకాశిస్తోంది తెల్లని ఎండ.

"మనమూ వెళ్ళిపోదాం రా" అంది సుశీల.

ఆమె బుజంచుట్టూ చెయ్యేసి వొచ్చేశాడు.

కళ్లు తెరిచేప్పటికి అడవిలో పందిరికింద పక్కమీద ఆమె బుజం చుట్టూ చెయ్యేసి కూచుని వున్నాడు. వాళ్ళ పాదాలముందు ఎండవార పడుతోంది. పిట్టలు ఆడుకుంటున్నాయి చెట్లల్లో. గోరింకలజత ఎదురుగా నేలమీద కూచుని చూస్తోంది. గోరింటపూల పరిమళం అల్లుకుంది అడివిలోంచి వాళ్ళచుట్టూ. కాని సుశీల అట్లా వుందేం? తన తల ఇంకా నీరసంగా బరువుగా వుంది కళ్లు తిరుగుతున్నాయి. రాత్రిలాగులేదు సుశీల. వుత్తమనిషి. నిద్రలేని కళ్ళతో, చెదిరిన జుట్టుతో, నలిగిన చీరెతో, ఆదుర్దాగా అతనివంక చూస్తోంది. మాట్లాడదా మనుకున్నాడు గాని నీరసం.

ఏదో ఇచ్చింది తాగడానికి, తరవాత మళ్ళీ నిద్రో మగతో. మళ్ళీ మెళకువ వొచ్చేటప్పటికి సూర్యుడు పందిరిపైకి వెళ్ళిపోయినాడు. చెట్లల్లోంచి వొచ్చే ఎండ ఆకుపచ్చగావుంది. ఆ వేడి రక్తంలోకివెళ్ళి ఓదారుస్తోంది. గాలిలో ఏవేవో నిర్మలమైన పరిమళాలు కొయ్యా, ఆకులూ నానిన వాసన వాటితో కలిసి. కొత్త కొయ్యల శుభ్రత. చెట్టును కొడుతున్న చప్పుడు, మనుషులో పిట్టలో. తన పక్కన సుశీల కూచుని వుంది. ఆమె ప్రియుడు కనపడడేం? ప్రశ్నలువేసే వోపికలేదు. ఆమె నించి మాటలూ ఖరించలేదు.

దుర్గ ఏం చేస్తోవుంటుందో! తనకోసం పత్రికల్లో ప్రకటన వేయించదుకద! ఇంతదూరం వస్తాయా పత్రికలు! తనని, వెతికి పట్టుకుని తీసుకునిపోదుకద! తను వెళ్లనన్నా లాక్కుపోతారా? ఎంత పొరపాటు చేశాడు తను! సుశీల వెళ్ళిపోయింతరవాత వ్యవహారం మీద మద్రాసు వెళ్లాడు. తనని హోటలుకి వెతుక్కొనివచ్చి ఇంటికి తీసుకుపోయినాడు చెంచుకిష్టయ్య. తనకి భార్య లేదుకదా, తను ఆ స్తినంతా ఏం చేసుకుంటాడు? బంధువులందరికీ, దూరంబంధువులకికూడా అతనిమీద చాలా ప్రేమకలిగింది. ఆ చెంచుకిష్టయ్యకి ఎన్నేళ్ళకీ ప్రాక్టీసు రాలేదు హైకోర్టులో. పైగా తాను అతన్ని వొకీలుగా పెట్టుకోలేదని కోపంగూడాను? తనకి మొహమాటం. ఎవరన్నా గట్టిగాపిలిస్తే

వెళ్ళకుండా వుండలేదు. కొందరికి చాతనౌను. కాని పైకి తాను తన మెత్తదనాన్ని కనపరచడు గావును. గట్టిగా డబ్బుయిమ్మంటే, ఇవ్వను పొమ్మనే శక్తిలేదని తన సంగతి ఎవరికీ తెలీదు. తానే గట్టివాడైతే సుశీల ఆటలు ఆ విధంగా సాగేవా? కాని గట్టివాళ్ల సంసారాలు మాత్రం ఏమాత్రం శోభిల్లుతున్నాయి? తన మెత్తదనం వల్లనే, సుశీల ఇప్పుడు తన పక్కన కూచునివుంది ఈ నిమిషం.

చెంచుకిష్టయ్య కూతురు దుర్గ, మరి మొదటినించీ ఎత్తువేశారేమో! తనని చాలా ఆదరంగా చూశారు, బి.ఏ. చదువుతున్న దుర్గ పుస్తకాల్ని నిర్లక్ష్యంచేసి తన సేవకి నిమగ్నురాలయింది. తనకి పాఠాలు చెప్ప మంది. ఆమెకోసం మరిచిపోయిన కెమిస్ట్రీనంతా తిరగవేసుకున్నాడు. ఆమెకి రాకనా? అదంతా ఒక స్కీంలాగు కనపడుతోంది ఇప్పుడు, మద్రాసులో తనపని తీరినా, సుశీలలేని ఇంటికి వెళ్ళడానికి బుద్ధిపుట్టకో. మరి దుర్గ స్నేహమో! తిరిగి వెళ్ళిపోలేదు ఇంటికి. సుశీలని చాలా త్వరలో మరిచిపోయినాడు. ఎంతసేపటికీ తనకి దుర్గకూతురే కనిపించింది. తనూ చిన్నవాణ్ణేనని గుర్తేలేదు. సుశీలతో తాను పడ్డ క్షోభతో తనకి ఎన్నో ఏళ్లు వొచ్చినట్టు అనిపించింది గావును?

"ఎక్కడికీ వెళ్ళరేం?"

"ఎక్కడికి వెళ్ళను?"

"అదేమిటి? బీచి, పార్కు, ఒక ఎగ్జిబిషన్ కూడా వుంది. సినీమాలు.... "

"ఏమిటో పాతమద్రాసు. అవన్నీ మీకు, చిన్నవాళ్ళకి."

"మీరేం మహాపెద్దవారా?"

"నువ్వు వెళ్ళవేం?"

"వొంటరిగానా? నాన్న, అమ్మా రారు."

"మరి నీకు స్నేహితులు లేరా?"

"వున్నారుగాని, సరదా వుండదు. అదిగాక మీరున్నారు."

"నాకోసం వుంటున్నావా? పోనీ నన్నూ రమ్మంటావా?"

"నా బలవంతాన వొద్దు."

ఎప్పుడూ ఆడవాళ్ళతో తిరగలేదుఅతను. దుర్గ డ్రస్‌చేసుకుని వొస్తే- ఈమెతో నేనా? అనిపించింది. చాలా అందం దుర్గ. కళ్ళు చెవులని అందుకోవాలని చూస్తాయి. నిదానంగా వున్నా చూపులు ఏమిటో చెపు తున్నట్లు వుంటాయి. కొత్త యవ్వనం, శరీరకాంతిలో, పెదిమల మీది ఉత్సాహంలో, నడకలో.

తరవాత రోజూ వెడుతున్నారు. ఇతర్లకు కొనిపెట్టడంలో సరదా అప్పుడు తెలిసింది తనకి. కొననీదు. తన సంతోషం ఆమెకేం తెలుసు ? తనకే ఓ. కూతురుండి, ఎదిగి చదువుకుంటో వుంటే. ఇట్లా మద్రాసు చూపించి ఎన్ని కొనిపెట్టేవాడో! సుశీలకా? సుశీలకి అందమైన వొస్తువుల మీద దృష్టి ఏదీ? మళ్ళీ అందం తెలుసు. పంచమినాటి చంద్రుడు గోడమీద పడుతుంటే అట్లా చూస్తో నుంచునేది. చలికాలంలో సూర్యకాంత, ఇంటి ముందు తాడిచెట్టు చుట్టూ పూస్తే ఏదో ఆవేశంతో ఆ పూలని తాకుతో నుంచునేది, కాని తనకేం అక్కర్లేదు. ఓ పువ్వునన్నా కోసేది కాదు.

నెలరోజులయింది. తను వెళ్ళిపోవాలన్నాడు ఇంటికి.

"వెళ్ళిపోతారా? ఎందుకు వెళ్ళడం?" అంది కళ్ళలో నీళ్ళతో దుర్గ.

"వెళ్ళక ఎన్నా రా, మా వూరు.'

"ఇప్పుడే వొస్తా."

"చదువూ?"

"అవును. మీరు వెళ్ళిపోతే ఇంకేం తోచదు."

వుండాలనే అనిపించింది ఆమె విచారం చూడలేక.

ఈనాడు అదంతా నిజమా నటనా, అని సందేహం.

ఆ రాత్రి ఇంగ్లీషు సినీమాకి వెళ్ళారు. వాళ్ళిచ్చిన హెరాల్డు కాయితం తనపక్కమీద పడేశిందిగావును?

పడుకోబోతున్నాడు. గదికిందనించి రేరాణి పరిమళం, లైటు ఆర్పితే మాఘచంద్రుడు గదినిండా, పొగకన్నా దట్టంగా. ఇంట్లో ఇంకా మాట్టాడుతూనే వున్నారు పిల్లలూ, పెద్దలూ. దుర్గ పరిగెత్తుకుంటో వొచ్చింది.

"హెరాల్డు ఇక్కడ పడేశానా? తమ్ముడు చూస్తానంటున్నాడు." పక్కమీదనుంచి తీసుకుంది.

"ఇదేనా" అని చూడ్డానికి తన పక్కకి కిటికీ దగ్గరకి వొచ్చింది. చూసింది. తనూ చూశాడు.

స్పెన్సర్ ట్రేసీ లోరటాయంగ్‌ని కావలించుకుని ముద్దుపెట్టుకుంటున్నాడు హెరాల్డులో. చిన్నగా నవ్వి తనవంక చూసింది. ఏమయిందో ఆ నిమిషాన? ఏం కాలేదు. తనేం చెయ్యనేలేదు, కాని ఏదో జరిగింది. ఆమె కదలలేదు. కాయితం వంకనే చూస్తోంది. లోపల్నించి ఆమెలో నించి ఆమె రొమ్ము ఆపిన విశ్వాసంతో బరువెక్కింది వెన్నెల్లో. వూపిరి చాలాసేపు ఆపినట్టు ఒక్క మాటుగా ఉక్కిరిబిక్కి రయ్యింది.

"ఏమిటి? ఏమిటి?"

ఆపుకోలేని దుఃఖం, మొహాన్ని తన భుజానికానించి, ఒకచేత్తో ఆమె ముఖాన్ని ఎత్తి, భుజంనించి రెండో చేత్తో కనీళ్ళు తుడిచాడు.

ఇంకా అర్థం కాలేదు. అట్లాంటివెన్నడూ ఎరగడు, సినీమాలో ఆ దేశంవాళ్ళు ఏం చేసినా, వాళ్ళగోల అది, తననేం కదిలించదు.

"ఏమిటీ? ఏమిటి?" అన్నాడు మళ్ళీ.

"ఇందాక....వాళ్ళు....ఇట్లానే...."

అని తనని అనుకుని ఏడ్చింది.

తనకీ, ఆమెకీ సరిపోయినంత విద్యుచ్ఛక్తి ఆమెలో ఆ రాత్రి, తన రక్తానికి వేడినిచ్చింది, ఆ వెన్నెలలో, సుశీలలో, నలిగిచచ్చిన తన యువ్వనం.

దగ్గిరికి లాక్కుంటే అందుకోనమే చూస్తున్నట్టు తనలోపలికి తన మీదికి జారిపోయింది. తన షర్టులోంచి ఆమె బ్లౌజులోంచి ఆమె ఉద్రేకం. తన మెడవెనక కలుసుకున్న ఆమె వేళ్ళ అలజడి. తనవేపు వెతుకుతున్న గుడ్డిగా వెతుకుతున్న ఆమె పెదిమలు.

ఇంక వొళ్ళు తెలీలేదు.

ఆమెని పట్టుకునే తలుపు దగ్గిరగా జరిగాడు.

ఒక చెయ్యి విడిపించుకుని తెరిచివున్న రెక్క మూస్తున్నాడు.

చప్పున తప్పించుకొని వెళ్ళిపోయింది. తన వెనక తలలోని మొల్లల పరిమళాల్ని వొదిలి. అప్పటికీ పెళ్ళి వుద్దేశ్యం రానేలేదు. తనకి, ఆ రాత్రంతా "న్యాయమా, సీతా?" అనే ఆఘోరించాడు తాను. ఇంక వెళ్ళతీరాలి. పెళ్ళిగాని పిల్లతో చాలా అధర్మం. దుర్గ అట్లా చేసిందని కోపంలేదు. తనమీద ఇష్టమూ అనుకోలేదు. నవ యవ్వనంలో వుంది. పెళ్ళికాలేదు. ఆ సినీమా చూసి కదిలిపోయింది ఆ వెన్నెలరాత్రి. పెళ్ళి చెయ్యకుండా పిల్లల్ని ఎదిగిస్తే ఇదే ఖర్మం. మర్నాడు తన దగ్గిరికి రాదను కున్నాడు. కానీ కాఫీ తీసుకుని వొచ్చి తలవొంచుకుని నుంచుంది.

"నువ్వూ తెచ్చుకోలేదేం?"

"తెచ్చుకోనా? మీకు కోపం వొచ్చిందనుకున్నాను. రాలేదా?" అని అతని తలని తాకి వెళ్ళిపోయింది ఒక్క గంతులో! ఎంత ఉత్సాహం ఆమెలో!

తన కాఫీ తెచ్చుకుంటో తలుపు దగ్గిరిగా వేసి వొచ్చింది. ఒక్క నిమషం ఆమెని తన వొళ్లో కూచోపెట్టుకున్నాడు. ఇద్దరూ ఒక కప్పు లోంచే తాగారు. తన వొళ్ళోకి దుర్గని తీసుకోనూలేదు.ఆమె తన వొళ్ళోకి రానూలేదు. ఆమె వొళ్లు తనకి తగిలిన చోటనల్లా ఏదో భూమికి సంబం ధించని ఆనందానుభూతి కలిగింది. ఎందుకు అంత తొందరలో మాయం కావాలి ఆ అనుభవం! ఎట్లా మాయమవుతుంది? ఎందుకు? మనుష్యులకు అంతమాత్రమే కటాక్షించాడు గావును ఈశ్వరుడు.

"ఎవరన్నా వొస్తారేమో!"

"రారు."

"వొస్తే?"

"రానీండి. తప్పేముంది?"

ఆనాడు ఇదంతా ముందే అందరూ యోచించుకున్నదేమో నన్న అనుమానం రాలేదు. ఈనాడూ నమ్మలేదు. కాదు; నిజంగానే ప్రేమించింది తనని. మరి అట్లా మారిందేం? అంతే మనుషులు.

ఆమెకోసం తను చూడడం. నిమిషానికోసారి నవ్వుతో, దూకుతో వొచ్చి తన వెనక నించి మెడని కావిలించుకుని, తను తిరిగేలోపల పారి పోవడం.

మళ్ళీ రాత్రి ఆ సినీమాకే తీసికెళ్ళింది. వెనకగా కూచున్నారు. మళ్ళీ ట్రేసీ ముద్దు పెట్టుకునే సమయాన తన దగ్గిరిగా అనుకుంది పక్క కుర్చీ లోంచి....లోరెటాని ముద్దు పెట్టుకోడం తను చూడనేలేదు.

వారం రోజులయింది. తప్పు. తప్పు తాను వెళ్ళిపోవాలి అనుకుం టూనే వున్నాడు. కాని ఆమెతో చెపితే. ఆమె పెదిమలమీది దైన్యం చూడలేడు. ఆరాత్రి—అప్పుడే కృష్ణపక్షం తొమ్మిదింటికి పున్నాగచెట్ల వెనకనించి లేచే పసుపుపచ్చ చంద్రబింబాన్ని చూస్తో, కాళిదాసు శ్లోకం చదువుకుంటున్నాడు.

తన లోపలిబాధ ఎక్కువగా వుంది. ఆడవాళ్ళు సహించగలరేమో! పోనీ కన్యలకి ఇబ్బంది లేదేమో! దాహంకొన్నవాడికి ఒక్కొక్క చుక్క నీటితో పెదవుల్ని తడుపుతున్నట్లుగా వుంది తన బతుకు.

ఎప్పుడు వొచ్చి నుంచుందో చప్పుడుగాకుండా తన వెనక. నిట్టూర్పుతో అతను వెనక్కి తిరిగేప్పటికి ఆమె రొమ్ము అతని చేతికి రాసుకుంది. చేతిని అట్లానే వుంచి ఆమెవంక తిరిగాడు. ఆమె వొం

బోంచి బైలుదేరిన గగుర్పు ఆమె స్తనం చివరినించి తన గుండెలోకి పాడి చింది. చేత్తో వెతికాడు.

ఆమె తప్పించుకుంది. తలుపు దగ్గిర ఆమెని పట్టుకుని వెనక్కి లాగాడు.

"ఇప్పుడు కాదు,"

"వీల్లేదు."

"నా మాట నమ్ము. ఇప్పుడుకాదు."

అని వెళ్ళిపోయింది. వెనక్కి తిరిగి దయగా నవ్వి.

నిరాశ పొందిన నరాలతో, తోచక అటూ ఇటూ కొట్టుకుని నిద్ర పోయినాడు. కాని ఎంత మధురమైన కాలం! అట్లాంటి బాధైన దొరకదు ఎంత కొట్టుకున్నా. ఆ అదృష్టం తొలిగిపోయింతరవాత.

నిద్రలో పెదిమలమీద ముద్దులు. తన మీద అనుకున్న బరువు. వెన్నెట్లో తెల్లనిచీరె. నార్సిసస్ పరిమళం మెడకిందనించి. మెల్లిగా తాను ఆమె పొట్టమీదనించి వేళ్ళని....

తలుచుకుని ఈనాడు ఏమైనాడో, సుశీల "ఏమిటి? ఏమిటి?" అంటోంది ఆదుర్దాగా! మళ్ళీ నిద్ర. చల్లగాలిలో, చెట్లనీడల్లో, రంపపు కోత రాగంలో—నిద్ర.

జబ్బుపడి లేచింతరవాత ఎంత అందంగా వుంటుంది లోకం. దేహమో, మనసో, తన పాతపొరల్ని, విషాల్ని, మామూలుతనాల్ని వొది లించుకుని కొత్తగా సహజంగా అనుభవిస్తుంది గావును! మనుషులమీద ఎంత ప్రేమ—బతికివున్నానని ఎంత సంతుష్టి!

ఆ జబ్బుతో చచ్చిపోయి, ఈ దేహభారంనించే బైటపడితే, ఇంకా కొన్నివేల రెట్ల అందంతోనో కనపడకూడదా ఈ పాత లోకం! తన కల జ్ఞాపకం వొచ్చింది! చాలా నిజంగా కనపడ్డది కల, సుశీలకి, తెలుసునా?

మాట్లాడబోయినా, రెండురోజులు మాట్లాడనీలేదు సుశీల. రాత్రంతా తన వొళ్ళు పడుతో తన నిద్రని చూస్తో కూచుంది. ఆమె అనిపించింది అతనికి—కూచుంటుందని తెలుసు. పూర్వమూ అంతే. అట్లాంటి సేవ ఆమెలో, తను తన్నినప్పుడు, వెముకలు విరక్కొట్టినప్పుడుకూడా, తనకేం బాధ కలిగినా, పాక్కుంటో వొచ్చేది పక్కదగ్గిరికి.

"ఎందుకు వొచ్చారు?" అంది మధ్యాన్నం. అదే మొదటి ప్రశ్న. ఎదురుగా రెండు కొయ్యరంగు చారల పిట్టలు కూచున్నాయి వాళ్ళవంక చూస్తో. చెట్లనీడలో హాయిగా! విశ్రాంతిగా? ఎండ కింద మెరుస్తో చెట్ల ఆకుల్లో చీకటి గుబుర్లు గాలికి వూగుతో.

"ఇబ్బందా?" అన్నాడు తను.

"ఏం ఇబ్బంది"

"అతను?"

"అతనా? ఏంలేదు."

"వుండనా!"

"తప్పకుండా."

ఊరుకుంది అటు తరువాత. మళ్ళీ అడుగుతుంది "ఎందుకు వొచ్చా" రని. ఎందుకు వొచ్చాడు? ఏం చెపుతాడు? చెప్పడానికేం వుంది? తన యాతన నిజంగా వుందా? ఇప్పుడు ఆలోచిస్తే ఊహించుకున్నానేమో అని అనుమానంగా వుంది. ఏం చేసింది దుర్గ? ఎందుకంత దుర్భరమయింది బతుకు? పెద్ద తప్పు తను సుశీలని మరిచి పోలేక పోవడమే. ఎందుకు మరిచి పోలేక పోయినాడు? అందంలో, యవ్వనంలో, విద్యలో, జ్ఞానంలో, ధనంలో అన్నివిధాలా అధికురాలు దుర్గ సుశీలకన్న.

సుశీల తనవంక చూస్తోంది. కళ్ళు మూసుకుని నిద్ర నటించి. యీ చిక్కు విడతీసుకోవాలి, లేకపోతే ఏం జవాబు చెపుతాడు శుశీలకి,

సుశీల అట్లా కదలకండా అడివికేసి చూస్తో కూచుంది. సుశీల ఎప్పుడూ అంతే వూరికే కిటికీలోంచో, నేలకేసో, చూస్తోనో, ఏమీ చూడకండానో అట్లా కూచునేది. దుర్గ ఎంత భేదం? ఏదో ఒకటి చెయ్యకుండా మాట్లాడకండా, తిట్టకండా వుండలేదు. సుశీల అంతే. ఏదన్నా అవసరం కలిగితే తప్ప కదలదు. మాట్లాడదు. ఏ ప్రియుడికోసమో కలకంటోంది అనుకుని ద్వేషపడేవాడతను.

ఏమిటి దుర్గలో పడని సంగతి తనకి? ఆమె గర్వం, మళ్ళీ తన మీద కాదు గర్వం, కాని ఆమెలోనే గర్వం. ఎవరిమీదా కాదు. మళ్ళీ మర్యాద, వినయం అన్నీ వున్నాయి. కానీ గర్వం, గడ్డకట్టిన గర్వం— తనని దేనికీ ఇచ్చుకోలేని గర్వం. మనసు లోపలి కారణంలేని గర్వం. గొప్పే అది, కాని సరిపడలేదు, తనకి.

ఎందుకాగర్వం అనియోచిస్తే ఆమె పాతివ్రత్యంవల్ల ననిపించింది. పూర్వం పతివ్రతలు సమస్తమూ లోపల్నించి అర్పించేసుకునేవాళ్ళు తమకీ వేరే వ్యక్తిత్వంలేకండా, వాళ్ళకి తాము పతివ్రతలమని తెలీనేతెలీదేమో; నాటకాల్లో పద్యాలలో "నేనే పతివ్రతనైతే" అని పాడిస్తారుగాని! తాను ఓ పాతివ్రత్యం చేస్తున్నానని చేస్తే ఏ మాత్రం చెయ్యగలదు! ధర్మపరుణ్ణి అనుకుంటో, జాలిలేకండా చేసే దానాలమల్లేనా వుంటుంది ఆ పాతివ్రత్యం. ఏమైనా ఈనాడు మాత్రం, పాతివ్రత్యం, స్త్రీలలో ఒక గర్వకారణ మయింది; దుర్గుణమైంది. అపురూపం కావడంవల్లనేమో, సుశీల నిరంతర వ్యభిచార గుణందని తెలిసికూడా తానింకా ఆ సుశీలనితలుచుకోడం భరించి వుండదు. అదే తనమీద కోపం, కాని తనకెందుకులేచిపోయిన ఈ సుశీల మీద? లేచిపోయిందా? లేచిపోలేదు. తను వెళ్ళకొట్టిందాకా వెళ్ళనేలేదు. తను ఎంత హింసించినా? అప్పుడు కూడా ఏడ్చింది తానేమైపోతాడోనని. మరి సుశీలమీద ఎందుకు తనకంత జ్ఞాపకం! ఏమో; అదే తెముల్చుకోవాలి ఇప్పుడు. కాని దుర్గ గర్వం తన నెందుకు బాధించింది? ఆ ఇచ్చుకోలేనితనాన్ని భరించలేదేమో పురుషుడు. అంతే ఆ మొదటిరోజుల్లోనే.

తన భార్యకాగానే, అధికారాన్ని పొందింది. తనమీద ఇష్టం నిజమే. ప్రేమ కూడాను. కాని అధికారిణి తాను. తన సౌకర్యాలన్నీ చాలా జాగ్రత్తగా చూసింది. కాని నౌకర్ల చేత చేయించేది. తాను చెయ్యవలసిన అవసరం లేదంది. నిజమైన ప్రేమవుంటే నౌకర్ల చేత చేయిస్తుందా? మరి నౌకర్లెందుకు? అదీ—ఎప్పుడూ పని ఆమెకి, మీటింగులు, ప్రయాణాలు, టీపార్టీలు, తను వుత్త భర్త. అందువల్లనే భరించలేకపోయినాడు, పదేపదే సుశీలని తలుచుకున్నాడు. సుశీల మల్లె ఎన్నడూ ఏడవలేదు దుర్గ. ఎంత కోపంలోనూ, బాధలోనూ, తనే దిక్కవలేదు ఆమెకి. ఆమె గర్వం, ఆమె కన్న ఆమెకి ఎక్కువ దిక్కు ఎవరూకాదు. ఎన్నాళ్ళయినా అంత అందంగానే వుంది. కాని ఆ మొదటిరోజుల విద్యుల్లతలే లేవు. ఆమెని ఎంతదగ్గిరిగా పట్టుకున్నా, అతనికి ఏ సుఖమూ కలగదు. తమని ఇచ్చుకునే గుణంలేనివాళ్ళనించి పొందే అసంతృప్తే అది. పురుషుడి సౌఖ్యం కన్న, తమ సౌఖ్యంకన్న, మోహంకన్న, కలయికకన్న, తాము అధికులమనే గర్వం రాయి గట్టిస్తుంది స్త్రీని. ఈనాడైనా, ఇంత చవకైనా సుశీల సామీప్యమే ఉజ్వలం. ఎన్నడూ తనకి తాను జ్ఞాపకం ఉండదు, సుశీలకి. పురుషుడికి ఏదో వరాన్నో, అనుగ్రహాన్నో, ఇస్తున్నామన్న ధ్యాసేలేదు. తానిచ్చిందానికన్న: ఇతరులే తనకిచ్చారనే కృతజ్ఞత.

మర్నాడు పొద్దున్నే అతను వొచ్చి కూచున్నాడు, కలపవర్తకం అతనికి.

"ఇక్కడే వుండండి, ఏమనుకోకండి. ఎంతకాలమైనా వుండండి" అన్నాడు సుశీల ప్రియుడు. హృదయ పూర్వకంగానే అన్నట్టు వినపడ్డాయి మాటలు. అతనెందుకు తనని అంగీకరించాలి, ఆదరించాలి. అంతా సుశీల ప్రజ్ఞ, ఆమె హృదయ విశాలత్వం, ఏమిటో దుర్గ పూర్తిగా మనిషిగా వుండదు. చాలామంది ఆడవాళ్ళమల్లెనే, మోహంలో ఐనా, దుర్గ శరీరానికి ఇష్టమే. కాని మనసులో సంకుచితత్వం, గర్వం, వేరుతనం వుంది. తననించేకాదు. ఆ మనిషే అంత, నాలుగు రోజులయిం తరువాత సుశీల కొత్తగా కనపడ్డది ఓ ఉదయం, ఏమిటా అని చూస్తే చెవులకి

కమ్మలు తీసేసింది. తన ఇంటినించి వొచ్చేప్పుడు తనిచ్చిన సొమ్ములన్నీ జాగ్రత్తగా తనకి వొప్పచెప్పేసి వొచ్చింది. తనకి ఏడుపు వొచ్చి తీసికెళ్ళమనీ, ఇంకా డబ్బుకూడా ఇస్తాననీ అనాలనిపించింది! వెళ్ళ మనగానే వెళ్ళిపోతోందని కోపమూవుంది. ఇక్కడ వొంటిమీద ఏమీ వొస్తువులులేవు. అడివి అని భయమేమో? కాదు. అసలు అట్టే సమృద్ధిగా లేవు ఏవీ. డబ్బుకి తంటాలే గావును. మర్నాడు బిస్కట్లూ, ఓవల్టిన్, బిబ్రివిల్, డబ్బాలపళ్ళూ అన్నీ తెచ్చారు ఎవరో!

"ఎందుకివన్నీ?"

"మీ కోసమే!"

"నా కెందుకు?"

"మీకు బలంపట్టడంలేదు."

"చాలా ఖర్చయివుంటుంది."

"ఫరవాలేదు."

ఆ మాటలో ఎక్కువ ధైర్యంలేదు. చప్పన అనిపించింది. ఆ కమ్మలకీ, యీ సామానులకీ సంబంధంవుందా అని సుశీలకి నగలంటే చాలా ఇష్టం.

"నీ కమ్మలు కనబడవేం?"

"తీసేశాను."

"ఏమి?"

"బాగుచేయిద్దామని."

"నిజం చెప్పు."

తల వొంచుకుంది.

"మాట్లాడవా?"

"ఏంలేదు. ఈ ఏడు ఈ వర్తకం అట్టే లాభంగాలేదు."

మాట్లాడకుండా తను తెచ్చుకున్న మూడువేలు జేబులోంచి తీసి ఇచ్చేశాడు. తీసుకోలేదు. తీసుకోకపోతే వెంటనే వెళ్ళిపోతానన్నాడు.

ఎదురుగా చిలకలగుంపు ఎగురుతోంది, ఆ ఉదయం. రెండు జింకలు తొంగిచూస్తున్నాయి దూరంగా. వాటి మచ్చలమధ్య ఎండచారలు పడుతో.

వారం గడిచింది. కోడిగుడ్లతో, సూపులతో అతనికి తొరతొరగా బలంపడుతోంది. ఆ టైఫాయిడ్‌లో బతికాడతను. ఆ జరంలో తనవేపు రాక నౌకర్ల చేత చేయించినందుకేగా తనకి ఆ చివరికోపం వచ్చి, బయలు దేరి ఇక్కడికి ప్రయాణమయింది తను!

మెల్లి గా అడివిలోకి కొంచెందూరం అటూ ఇటూ షికారుకూడా పోతున్నాడు. వాళ్ళపాక, పనివాళ్ల గుడిశలే ఆ అడివికి ఇళ్ళు. చెట్లు చాలా కొట్టెయ్యడంవల్ల విశాలంగా వుంది. ఒకరోజు సుశీలకూడా వొచ్చింది అతనితో. కొంతదూరం వెళ్ళి నడవలేక వెనక్కి తిరిగాడు. కళ్ళచూపు అందనంత ఎత్తు చెట్లలో పడమటిఎండ పసుపుగా ఎర్రగా, చెట్టునించి చెట్టుకి కాంతి వరదలతో పూడ్చేస్తోంది. ఏదో ఓ మూలనించి ఇదివరకు వినని పక్షి అరుస్తోంది మధురంగా. వాళ్ళిద్దర్నీ పైనించి వెయ్యికళ్ళు, పక్కనించి ఏవో మృగాలు కనిపెడుతున్నట్లు వుంది. ఉడతలు, పక్షులు, కోతులు, "ఇట్లాపోదాం" అని పక్కగా వెళ్ళారు కొంతదూరం. అక్కడ సగం ఎండిన ఏరు, రెండుప్రక్కలా కస్తూరి తుమ్మచెట్లు, ఆ పచ్చనిపూల పరిమళం భరించడం కష్టంగా వుంది. అక్కడక్కడ ఏటిమీద శాఖలు కలుపుతున్నాయి చెట్లు: తేటనీరు, పక్కన మనిషి తొక్కని ఇసిక పరుపు. నీడలో కూచున్నారు అలిసి. వెల్లికిత్తలా పడుకున్నాడు అతను. కొమ్మల్లోంచి ఆకాశం చూస్తో, ఇంతకన్న ఏ శాంతి కావాలి మానవుడికి?

"ఎంత చిక్కిపోయినారో?" అంది మెడదగ్గర బైటపడ్డ వెమికల్ని

"దుర్గ మంచి అమ్మాయేనా?"

"ఊఁ."

"నాకుమల్లే కష్టపెట్టలేదు కద మిమ్మల్ని?"

"లేదు."

"మరి ఎందుకు వొచ్చేశారు?"

"నిన్ను మరిచిపోలేక."

"పొండి. అబద్ధం. ఏదో కారణం వుంది."

"ఆ కారణమంతా నిన్ను మరిచిపోలేక పోవడం వల్లనే.'

"మరిచిపోలేక ఏం లాభం?"

"అంతే."

ఆమె కంఠంలో కొంత భయంకూడా వుంది, ఆమెని మళ్ళీరమ్మని పిలుస్తాడనా?

ఉడతలు పరుగెత్తుతున్నాయి. ఎర్రటోపీల పిట్టలు నీళ్ళ కోసం వొచ్చాయి. దూరంగా కొంగ ధ్యానం చేస్తోంది.

ఆమె చేతిని తన అరిచేతులో పట్టుకుని ఆకాశంవంక చూసి ఆలో చిస్తున్నాడు. ఆమె కూడా మోచేతిమీద ఆనుకుని వొరిగి అతని కేసి చూస్తోంది. తన మొహాన్ని తిప్పి ఆమెకేసి చూశాడు.

"అంత జబ్బుతో బైలుదేరారు. చచ్చిపోదురు."

ఆమె కళ్ళలో తడి. గాలికి ఆమె జుట్టు అతని బుజంమీద ఎగురు తోంది.

"నాతో ఇట్లా వొస్తే ఏమీ అనడా?"

"ఏమో! నాకేం తెలుసు?"

"అంతే?"

"అననీండి."

అప్పుడు అంతే సుశీల. కొడతారు అంటే కొట్టనీండి అంటుంది. తనదగ్గిర ఉన్నప్పుడు తక్కిన వాళ్ళతో అట్లానే అని వుంటుంది. తను చాలా కఠినంగా కొట్టేవాడు. భరించలేక అవతల మనిషితో "కొట్టాడు" అనివుంటుంది. కొడతాడు అని వాళ్ళు జాలిపడితే, "కొడితేనేం, నీ కౌగిలి కన్నా?" అని వుంటుంది. ఏమయ్యేవాళ్ళో ఆ మొగవాళ్లు ఆ మాటకి! ఇంక ఆమె ఋణాన్ని ఎట్లా తీర్చుకోగలమా అన్నట్టు అయివుంటారు. ఆ మాటలు మాటలేకాదు. నిజం. ఆమెని కొట్టవలసి వచ్చే గతి తనకి పట్టడం, ఎంత కొట్టినా లాభంలేకపోవడం, ఆ రోజుల తన వేదన, ఆమెని తాను విడవలేనితనం జ్ఞాపకం వొచ్చి ఆమెవంక చూసేప్పటికి ఆమె తన కన్నీళ్ళని తుడుస్తోంది.

"ఏమిటి?"

"జ్ఞాపకాలు."

"నేనా?"

"నీ కోసమైన నా బాధ!"

ఆమె ఏడుపు ఆపుకోలేకపోయింది.

"ఛండాలురాల్ని, మిమ్మల్ని కాల్చేశాను," అని గుక్కలు మింగలేక ఏడ్చేసింది.

అతని చెయ్యి ఆమె మెడచుట్టూ! ఆమె తల అతని రొమ్ముమీద.

ఆమె జుట్టులో ఎండపడి అతని కళ్ళల్లోకి. మెల్లిగా ఆమెని పైకి తీసుకుంటున్నాడు. తన చేతులో ఇరిగిపోతున్నట్టు, వశ్యమయ్యే ఆమె నంతా. అతని అభిలాషని గ్రహించింది.

"వొద్దు."

చివుక్కుమంది అతని అహంభావం. కావలసిరావడం. కాచి ఆ చిన్న ఇబ్బందిని కూడా గ్రహించింది ఆమె.

"ఇంకా మీకు బలం పట్టలేదు."

అదే సుశీల. ఎప్పుడూ తను ఇష్టపడ్డవాళ్ళకోసమే, వాళ్ళ సంగతే, తను అని ఎక్కడా లేదు ఆమెకి.

వాళ్ళు బైలుదేరేప్పటికి చెట్లని వొదిలి పచ్చికనించి బారల బారలుగా శలవు తీసుకుంటున్నాడు సూర్యుడు. ఉడతలూ, పిట్టలూ వెళ్ళి పోతున్నాయి ఇళ్ళకి.

రాత్రి వొంటరిగా నక్షత్రాలవంక చూస్తో కొంచెం బాధపడ్డాడు' ఆమె ఆ నిమిషాన ఆ ప్రియుడి చేతుల్లో పడుకుని వుంటుందని. ఆ నిమిషాన ఆమెని అతనేం చేస్తోవుంటాడోనని తలుచుకుని. సాయంత్రం అప్పటి తను జ్ఞాపకం వొస్తాడా ఆమెకి! కాని ఇప్పుడు ఎక్కువ బాధ రాలేదు. ఆమె అతనిదీ, అతని భార్య, తనకి ఎరువు. తను తీసుకుంటు న్నాడు ఆమెని. అనుకునేటప్పటికి శాంతి వొచ్చింది.

అన్ని చిత్రాలు మానవ హృదయంలో....ఆ నక్షత్రాల కన్న లోతు రహస్యాలు.

దుర్గని, తన ఆస్తిని, వూరిని, మిత్రుల్ని, వ్యాపారాన్ని అన్నిటినీ వొదిలిరావడం తాను; ఎట్లా వొచ్చాడు? తనకి తెలీకుండానే సుశీలపైన తనకెంత విశ్వాసమో, పరస్పరం అంత గాయాలు చేసుకున్న సుశీలమీద! ఎవరన్నా తెలిస్తే నవ్వరా! తనకి మతీ, నీతీ, వుందనుకుంటారా ? ముందు సంగతి? ఏమో! సుశీల ఎన్నడూ తనని అన్యాయం చెయ్యదు. వొంటరినీ కాని అంతటితో ఆగదు, ఎట్లానూ తప్పదు సుశీలని తాను తీసుకోడం. తెలిసి అతను ఆమెని తంతాడా? మళ్ళీ ఆమెకి మొదలా యాతన! వీల్లేదు. తను వెళ్ళిపోవడమే మంచిది. తనతో వొచ్చేస్తుందా పోనీ! ఏమో? వొచ్చి మళ్ళీ ప్రారంభిస్తుంది. తను సహించగలడా? మళ్ళీ తంతాడు. ఎందుకు వొచ్చినట్టు తను, సుశీలని సుఖంగా బతకనీక!

మొదటిసారి సుశీల తననించి వ్యభిచరించడం జ్ఞాపకం వొచ్చింది.

పుకార్లు విన్నాడు. ఆకాశరామన్న ఉత్తరాలూ వొచ్చాయి. కాని నమ్మలేదు తను.

ఓ వెన్నెలరాత్రి కళ్ళతో చూశాడు. వెర్రెక్కిపోయింది. ఆమె తిరిగి రావడంకోసం చూస్తున్నాడు.

"ఎక్కడికి వెళ్ళావు?"

"తోటలోకి. నిద్రరాక."

"నిజం చెప్పు."

అంతే తెలిసింది గావును ఆమెని తను చూసినట్టు. అంతే. ఒక్కమాటలేదు. కొట్టాడు. చచ్చేట్టు కొట్టాడు, మాట్టాడదు. పొమ్మన్నాడు. ఆ నిమషాన పొమ్మన్నాడు. పోలేదు. మంచం పక్కన కింద కూచుని అతని కాళ్ళు పట్టుకుని ఏడుస్తోంది. తన్నాడు. ఎక్కడ తగిలిందో, పడిపోయింది. లేవతీశాడు. మెడ పట్టుకు వేళ్ళాడింది. పైగా "పాపం— పాపం! పిచ్చి నాయనకి చాలా కోపం తెప్పించాను."

ఆ మాటలతో తనకి ఎంత వొళ్ళుమండిందో, ఏడుపు వొచ్చింది రోషంతో, తనని తలుచుకుని తనమీద, బాధమీద జాలివల్ల.

"ఏడవకు, ఏడవకు" అని తన తలని, తల్లిలాగు రొమ్ముకి అద్దుకుంది, అంతే. దాంతో అతనికి వొళ్ళు తెలీలేదు. ఆ రాత్రి మళ్ళీ మొదటిరాత్రికన్నా ఎక్కువ మాధుర్యాన్ని సుఖాన్ననుభవించాడు. తన కసీ, క్రోధం, బాధ అన్నీ ఏదో వింత ఆకర్షణగా మారిపోయినాయి. తనూ చాలా బలాఢ్యుడు—తలచుకుంటే ఇప్పుడు నవ్వు. మొదట తను, తరువాత అతనెవరో, మళ్ళీ తను — ఆ రాత్రే. తనదీ. తనదీ! తనది కాకండా ఎట్లా పోతుంది! రానీ వాణ్ణి. కాపలా కాశాడు ప్రతిరాత్రీ. రాలేదు వాడు. సమయం చూసి వెముకలు విరిగేట్టు తన్నించాడు వాణ్ణి వాడి పొలంలోనే. అప్పటికి శాంతించింది అతని కోపం.

కాని మళ్ళీ అర్నెల్లకే, తన కన్ను మరుగుకాగానే. ఇంకోడితో మళ్ళీ ప్రారంభం.

పుకార్లు, అప్రతిష్ట, సిగ్గు, తలెత్తుకోలేకపోవడం, వాతలు పెట్టాడు ఓ రాత్రి, మాట్లాడదు. అతని చెయ్యి కాలిందని విసిరింది రాత్రంతా మందుపూసి, ఎట్లా వొదలడం ?

తనూ బలాఢ్యుడే. ఎందుకా గుణం!

బతిమాలి అడిగాడు. పొమ్మన్నాడు. పోదు.

ఆమెని తాకను పొమ్మన్నాడు. సరేనంది.

ఎందుకో ఆగుణం చెప్పమని బతిమాలాడు. చెప్పదు. తెలీదు గావును ఆమెకే.

ఆమెనించే అరాలుతీశాడు. సంగతులు, కార్యం కాకముందునుంచీ అంతేట ఆమనిషి, తరవాత ఇంకోరు.

ఎందర్ని తన్నిస్తాడు ? చివరికి విధిలేక గెంటాడు ఇంటోంచి, పోకపోతే జుట్టుపట్టి ఓరాత్రి బైటకి ఈడ్చి తలుపువేశాడు. మనసు రాయి చేసుకుని వూరుకున్నాడు. ఏమయిందో తెలీదు. తరువాత ఈ ఉత్తరం వొచ్చిందాకా ఈ అడివినించి. అసలు తానెప్పుడూ సుశీలనే వొంచిస్తున్నాడేమో ననిపించింది. గతిలేక సుశీలను వెళ్ళగొట్టాడు గాని, సుశీల వెళ్ళం తరువాత జీవితం అయోమయమైపోయింది. ఏ వస్తువ ఎక్కడవుందో తెలీదు. తనకి భోజనానికి ఏమి ఇష్టమో మరిచిపోయినాడు. బట్టలు ఎన్ని తగాదాల్లోకూడా, తను ఎంత తన్నినప్పుడూ, ప్రియుడికోసం ఆమె తపిస్తున్నప్పుడుకూడా, తన సేవలో ఒక్కలోపం కలగనీలేదు. అందుకే ఏంతోచక వెళ్ళిపోయినాడు తను మద్రాసు.

దుర్గకి నౌకర్లు వృత్తచాకిరీచేసే మనుషులు, మొహం చిట్లించుకొని మాట్లాడదు వాళ్ళతో, ఆమె వికాసమల్లా ఇరుగు పొరుగు ధనవంతులు వొచ్చినప్పుడే. బట్టతో, మాటతో విలవ కడుతుంది మనుషుల్ని. తనని తాను వొదులుకొని, మరిచిపోయి ప్రవర్తించదు ఏ నిమిషంకూడా, తన దేహాన్నికూడా చీరెని ఎరువిచ్చినట్టే ఇస్తుంది.

ఈ అడివిలో ఈ కూలీలందరికీ మిత్రురాలు సుశీల. కూలీల ఆడవాళ్ళ గుడిసెలముందు కూచుని, వాళ్ళకూరలూ, బాధలూ, పిల్లలూ, అన్నీ తనే పంచుకుంటుంది. కలవరంపం చేస్తోవుంటే అక్కడ కూచుని పలకరిస్తుంది కూలీల్ని. నవ్విస్తుంది. మనిషినించి మనిషికి ఆప్యాయంగా ప్రవహించే సుహృద్భావంగావును అది. ఆ భావం ఎక్కువై ప్రియుల తాపం భరించలేక పోయిందేమోనని ఆమెకి Excuses ఎక్స్యూసెస్ వెతికాడు.

చాలా శాంతంగా హాయిగా గడిచిపోతోంది కాలం. ఆమె ప్రియుడు వర్తకానికి చాలా రోజులు వెళ్ళిపోతోవుంటాడు. ఓ రోజు వొచ్చి అడిగాడు. తను ఇచ్చిన మూడువేలలోంచీ వోవెయ్యి అప్పుగా వర్తకంలో ఉపయోగించ వొచ్చునా అని. మూడువేలూ తీసుకోమన్నాడు. కాలం: నున్నని నెమ్మదైన జలధారమల్లే మెరుస్తో వెడుతోంది. లెఖ్ఖలు చూసు కోడానికి ఏమీలేదు. క్రమంగా చలి తగ్గడం, కొత్తరకాల పిట్టలు రావడం, కొత్త రంగులతో, కొత్త ఈలలతో. కొన్ని మృగాలు ఎక్కువగా తొంగి చూడడం, చెట్ల ఆకులు ఎరుపుగా మారడం. ప్రతిసాయంత్రం ఉదయం అట్లా తిరిగివస్తాడు. సుశీలకి పని ఎక్కువగావుంది. తనతో రావటం లేదు. ఒక్కొక్కప్పుడు ఆ ఏటివొడ్డున ఇసికలో కూచుంటాడు. సుశీల తనతో అంతకాలం వుండకపోయినా, అంతసేపూ ఆమె చూపులు తన వెంట ఉన్నట్టే వుంటాయి. ఆమె హస్తాలు తనని సద్దుతో తనని కావి లించుకునే వుంటాయి.

ఒక మధ్యాన్నం యేటివొడ్డున అదే స్థలంలో కూచున్నాడు. వరసగా చాలా కొంగలు చేరాయి. ఆ తేటనీటిలో ఆడుకునే చిన్నచాపల్ని మింగేస్తున్నాయంటే దిగులేస్తుంది. పెద్ద ముక్కుల నీలంపక్షులు నీటిమీద బాణాలవలె దూసుకుంటో. పొదల్లో గుంపులు గుంపులు పూరపిచ్చికలు. తటాలున పరిగెత్తే కుందేళ్ళు, తొంగిచూసే దుప్పులు, నీళ్ళమీద ఎగిరి ఎగిరి పడే ఎండ. గాలికి నీళ్ళు కదిలినప్పుడల్లా, మెరుపుమార్పులు, ఏమిటో ఇదంతా ఈ ఆట, ఈ అందం ? ఎవరికోసమో ! ఎందుకోసమో ! అని ప్రశ్నలు అర్థాలు యోచించవలసిన అవసరం లేకండా ఆ గాలి

మళ్లేనే మనసుమీదనించి చిన్నస్పర్శతో తేలిపోయే ఆలోచనలతో నిద్ర పోయినాడు. ఎండలో ముక్కలు మెరిసే కొంగలకేసి చూస్తో.

కళ్లు తెరిచేటప్పటికి ఎండలేదు. మృదువైన గాలి తన తెల్లని జుట్టుని, ఇదేమిటి ఇక్కడ? అన్నట్లు కదిలించి చూస్తోంది. సాయంత్రపు మెత్తని వెన్నవంటి కాంతి. తన పక్కన సుశీల తనకి తగులుతో పడు కుంది. నిద్రపోతో, చాలాసేపు చూశాడు. నవ్వే శాంతమైన ఆమె కను రెప్పల్ని, ఏం భయం, ఏం అశాంతి, ఆమెకి? ఏం లేదు. హాయి. తిట్లూ, దెబ్బలూ, బీదరికం, వేటిని చూసినా భయంలేని, వాటినీ జీవితంలో మామూలు భాగంగా తీసుకునే ఆమెకి ఏం భయం? తను, తన అహం, తనబాధ, తన ఆత్మకి గాయం, తన గౌరవం, అనుకునే వాళ్ళకే భయాలూ బాధలూ.

ఆమె తనదీ, తనది కాదు— ఎట్లా చూసుకుంటే అట్లానే. ఆమె లోంచి ఏ బిగించే వలలూ రావు. వేరు పరిచే తడికలూ వుండవు.

మెల్లిగా పక్కకి తిరిగి ఆమె చుట్టూ చెయ్యి వేశాడు.

నిద్రలోనే చిరునవ్వు. ఎవరనుకుందో? ఎవరనుకుంటేనేం ? తను అని తెలిసినప్పుడు వేరుతనం రాదు. ఆ కళ్ళలోకి. ఆ చల్లని గాలి ఆమె కుచ్చెళ్ళతో ఆడుకుంటోంది. మెల్లిగా, మెల్లిగా, ఆమెమీద తన అపారమైన ప్రేమని ఆపుకోలేక తన మోచేతినానుకుని బలువు తెలీనిక ఆమె రొమ్ము మీదికి వొంగాడు, ఆమె వూపిర్ని తన మొహం మీద అనుభవిస్తో, ఆమె యీ అడివిలో సహజమైన ఒక ప్రాణి అనిపించింది అతనికి.

మెల్లిగా కళ్ళు తెరిచి చూసింది. నవ్వింది దయగా, అరిచేతుల్ని ఆమె వీపుకిందికి ఇసిక లోకి పోనిచ్చి ఆమెని దగ్గిరగా తీసుకుని, "నాకు బలం వొచ్చింది." అన్నాడు పెదవుల్లోకి.

ఆ రాత్రి నక్షత్రాల కాంతిలో, అప్పుడే వుదయించి చంద్రవంక

వెలుతురు పందిరి కిందికి పాకుతోంది! ఆమె యజమాని లేడు. సుశీల వొచ్చి తనపక్కన పడుకుంది!

"అతను ఏమంటాడు?"

"వూరికే ప్రశ్నలతో గోలపడకండి. ఏం జరిగితే అది జరుగుతుంది. అన్నీ నాకు వొదిలెయ్యండి."

"ఎందుకు ఊరుకుంటాడు? అతని మనిషివి."

"ఎన్నడో మొదటిరోజే చెప్పాను అతనితో. నేనెవరో కూడా తెలీదు అతనికి అనాడు. నా భర్త నన్ను కోరిననాడు నా భర్తదాన్నేనని. భయపడకూ, నా పాపవి నువ్వు, నిన్ను నేను వదలను!" అని అతన్ని దగ్గిరికి తీసుకుంది.

"ఎందుకు?"

"ఎందుకేమిటి ? నీ భార్యని కానా? ఏం జరిగినా అదెట్లా అబద్ధమౌతుంది?"

చంద్రుడు ఆశీర్వదించాడు. నక్షత్రాలు నమస్కరించాయి ఆ పతివ్రతకి.

## ౧౯౩౦

పదేళ్ళకి స్వదేశానికి తిరిగి వొచ్చాను. ఇండియా రాయబారి కింద నన్ను జూలూలాండుకి పంపారన్నమాట జగద్విఖ్యాతమే. నూలు పోటీ పరీక్షలో, మా బావమరిది ధర్మాన నాకు మొదటి బహుమానం రావడం వల్లనూ, ఇంగ్లీషువారు నన్ను ఆరుసార్లు జైలుకి పంపడం వల్లనూ ఆ ఉద్యోగం నాకు నేనే పిలిచి ఇప్పించుకున్నాను. రోడ్డుమీదివాళ్ళని తన్నవచ్చునా ఎంత తాగితే మాత్రం, అన్న విషయాలపై నాకూ పోలీసు వాళ్ళకీ భేదాభిప్రాయాలు ఏర్పడబట్టి మొదటి రెండు సారులూ నన్ను బలవంతాన జైలుకి పంపారు. ఖద్దరు కట్టుకున్నాను, గనక "గాంధీకి జై" అంటూ జైలుకి వెళ్ళాను. మూడోసారి ఎక్కడ వున్నామో ఏం చేస్తున్నామో తెలీక కాంగ్రెసువాళ్ళని పోలీసువాళ్ళ మీటింగులో తంతూవుంటే, పాతకోపాన ఓ ఇన్‌స్పెక్టర్ని సీసాకాయికో నెత్తిమీద కొట్టేటప్పటికి మళ్ళీ జైలులో పెట్టారు. విడుదల ఐనప్పుడు తక్కిన వాళ్ళకన్న నాకు ఎక్కువ పూలదండలు వేసి వూరేగించడంవల్ల తరవాత ప్రతిసారీ జైలుకి వెళ్ళడం తప్పిందికాదు.

రెండు మూడు సంవత్సరాలు భారత ప్రతినిధిగా ఆ దేశంలోవున్న తరవాత నా ఉద్యోగం ఉందో లేదో నాకు నిశ్చయం లేకపోయింది. ఈ దేశంలో నన్ను నియమించిన ప్రభుత్వం నిలిచిందో వూడిందో తెలీ లేదు. కాని అప్పటికే నేను స్వయంపోషక ప్రావీణ్యున్నైనాను. అంటే అక్కడి స్త్రీలు నా మీద experiment ఎక్స్పెరిమెంట్ చేయ మొదలు పెట్టారు. నారంగు వాళ్లనించి భేదించడం వల్ల, నాలో శృంగారభేదంకూడా వుంటుందని ప్రతీతి కలిగింది. కొంతకాలం ధనంగల వితంతువుల చేతులు మారాను, నాకోసం డిమాండు అమితమై, వాళ్లలో వాళ్ల కాంపిటీషన్

భరించలేక, స్త్రీలు ఒక మీటింగుచేసి, నన్ను నా స్వదేశానికి పంపితేనే గాని అంతర్జాత్యుద్ధం తప్పదని భయపడి, relief order రిలీఫ్ ఆర్డర్ నాచేతి కిచ్చారు. రెండు నెలలు వీడ్కోలు విందులూ పడకలూ జరిగాయి. బలము సీదాపోయి, ఇంక బతుకుమీద ఆశవుంటే భారత మాతని చూడా లంటే పడవెక్కక తప్పదనుకున్నాను. మొత్తానికి, జూలూదేశంలో భారత జాతికి కామ ప్రతిష్టని. అందులో స్వతంత్ర భారత స్తంభనకీర్తిని అప్రతిహతంగా నిలబెట్టగలిగాననీ నా గర్వం.

రేవుపట్నానికి వెళ్లి ఓడల ఆఫీసులో ఇండియాకి వెళ్లాలని అడిగాను.

"ఇండియా? ఇండియా?" అని తల గోక్కున్నాడు ఆ ఆఫీసరు.

"అవును."

"ఇండియా ?.... అవును.... ఇండియా. ఒక దేశం వుండాలి అట్లాంటిది." అని పక్కవాళ్లని పిలిచాడు. వాళ్లు లేచివొచ్చి ఆయన చుట్టూ నుంచున్నారు.

"ఇండియాకి వెళ్లాలిట. ఇండియా ఎక్కడ వుంది?"

"సయాంకి తూర్పుగా, చైనాకి నైరుతిగా వుండేది పూర్వం" అన్నాడు ఒక జాగ్రఫీ పండితుడు.

"ఇప్పుడు అక్కడ లేదా?" అన్నాను గద్గదకంఠంతో.

"వుండే వుండవొచ్చు.... ఎందుకంటే, చాలా రోజులయింది ఆ దేశం సంగతి విని." అన్నాడు ఒకాయన.

"అంత కళ్లు మూసుకుపోయినాయా మీకు?" అన్నాను కోపంతో. నన్ను వేళాకోళం చేస్తున్నారని.

"కోప్పడకండి, మేమే కాదు. ప్రపంచంలో ఎవరికీ అట్టే తెలీనట్టుంది ఆ దేశం సంగతి ఇప్పుడు" అన్నారు ఇంకోరు.

"ఏం ?"

ఆలోచించారు వాళ్ళు. ఒకాయనకి జ్ఞాపకం వొచ్చినట్టుంది.

"ఆ....అదీ....స్వయం నిర్ణయం అయిపోయింది" అన్నాడు.

"అవును. స్వయం నిర్ణయం అయిపోయింది" అన్నాడు ఇంకో ఆయన జాలిగా.

"అవును పాపం స్వయం నిర్ణయం చేసుకుంది" అన్నాడు పెదవి విరిచి ఇంకో ఆయన.

"అంటే?" అని అడగాను.

"అంటే. తన సామానుల్ని తానే తయారుచేసుకుంటోంది."

"అయితేనేం? తప్పా?"

"తప్పేముంది? ఇతర ప్రపంచంతో సంబంధంపోయింది."

"మరి ఎగుమతులు?"

"తనసరకుల్ని తానే వుపయోగించుకుంటోంది."

"ఇతరదేశాలతో రాయబారం?"

"ఇండియాకి అవసరంలేదు."

"మరి యుద్ధాలూ, సంధులూ?"

"ఏమక్కర్లేదు. ఎవరినించీ ఆ దేశానికి భయంలేదు."

"ఎందుచేత?"

"సహాయనిరాకరణం చేస్తుంది."

"ఓ."

అని దిక్కులు చూస్తున్నాను.

"మరి మాదేశం స్టీమర్లు రావా ఈ దేశానికి?"

ఇంతలో ఇంకో ఆయన వొచ్చాడు.

"ఇండియా సంగతా? ఇండియాకి" స్టీమర్లులేవు, యుద్ధనౌకలులేవు, ఏదేశంనించీ స్టీమర్లు ఆ దేశానికిపోవు అవసరంలేదు. ఆ దేశాన్నించి ఇంకోదేశానికి స్టీమర్లు రావు."

ఆరువారాలు కాచుకొని సింహళం వెళ్ళే వోడని ఒకదాన్ని పట్టుకున్నాను. ఆవోడ అధిపతి,

"ఇప్పుడు లోకంమారింది. మిమ్మల్ని దిగనీరు సింహళంలో, దిగనిచ్చినా, ఇండియాకి రాకపోకలు లేవు సింహళంనించి. అయినా ఎందుకువెడతారు ఆదేశం? వొద్దు, నామాట వినండి" అన్నాడు.

ఎట్లాగయితేనేం బతిమాలి బొంబాయిలో నన్ను దింపడానికి ఏర్పాటు చేసుకున్నాను. అంటే నా శక్తిగల ప్రియురాలి influence ఇంఫ్లూయోంస్ ఉపయోగించి.

ఓ అర్థరాత్రికి బొంబాయి చాలా కులాసాగా ప్రయాణంచేసి చేరుకున్నాను. పోవొద్దని నామెడచుట్టూ చేతులు పెనవేసుకుకూచున్న బర్మీసు వనితనీ, నా నడుంచుట్టూ కన్నీళ్ళతో వేళ్ళాడుతున్న జపాను ప్రియురాలినీ తప్పించుకొని చిన్నపడవలో ఎక్కాను. ఆ పడవ నన్ను వొడ్డునదించి చక్కాపోయింది.

హార్బర్‌లో లైట్లు వెలుగుతున్నాయి. కాని ఎవరూలేరు, ఏవోడలూ లేవు. నావెంట నాలుగు బరువైన పెట్టెలు తీసుకొచ్చాను. ఏం తోచక ఆ పెట్టెల్ని వొదిలి అటూ ఇటూ నడిచాను. ఒకచోట పడిపోయిన ఒక గదిమీద 'కస్టమ్సు' అని హిందీలో ఒక బోర్డువుంది, ఒక్కొక్క పెట్టెనే మోసుకుపోయి అక్కడ పెట్టుకుని తలుపుకొట్టాను. చాలాసేపటికి కళ్ళు నులుముకుంటో ఒకాయన గడియతీసి తలుపులోంచి తొంగి చూశాడు నేను గబగబా ప్రశ్నలడిగాను. ఇదివరకు నేర్చుకున్న తురకంలో.

"కార్లు లేవా? కూలీలు లేరా? కస్టము లేదా?" ఇట్లాంటివి.

వాటన్నిటికీ అతను, మంచి హిందీలో "ఎవరు" అన్నాడు.

చెప్పాను.

"ఓడలోంచి దిగారా? ఓడలోంచి??" అని వింతగా సముద్రంకేసి చూశాడు.

చాలా interest ఇంటరెస్టుతో, అపూర్వమైన విశేషం జరిగినట్లు. నా సంగతంతా కనుక్కున్నాడు.

"తమాషా, తమాషా" అంటో తలుపు వేసుకొంటున్నాడు.

నేను అడ్డపడి ఆపి, "నేనేం చెయ్యాలి?" అని అడిగాను.

"నిద్రవొస్తోంది" అన్నాడు.

"మరి కష్టమ్ము సంగతేమిటి?" అన్నాను.

"వూళ్ళో వున్నాడనుకుంటాను, పిలిపిస్తాను" అన్నాడు.

"మీరెవరు?"

"నేను బొంబే గవర్నర్ని, సముద్రంగాలికి ఇక్కడ పడుకున్నాను" అన్నాడు; ఆ పడిపోయిన పాత గదిలో.

పిచ్చివాడితో మాట్లాడుతున్నాను, ఆ గవర్నరు తెల్లని ఖద్దరు నిక్కరూ బనియనూ వేసుకున్నాడు.

"మరి నే నెక్కడికిపోను?"

"ఎక్కడికిపోవాలి మీరు?"

గొర్రిపూడి మావూరు.

"రైలు దొరికిందాకా హోటలుకి వెళ్ళాలి."

"హోటలా? హోటలేమిటి? సరే వెళ్ళండి" అని తలుపు మూసుకుంటున్నాడు.

ఇంతలో అతని మల్లేనే—అంటే ఖద్దరూ నిక్కరూ, బనియనూ—కాని ఆకుపచ్చరంగువి వేసుకున్న ఇంకొక అతనువొచ్చాడు, ఆ గవర్నరు "అమ్మా, రక్షించావు. ఇతనిసంగతి చూడు" అని వెళ్ళి తలుపు వేసుకుని పడుకున్నాడు.

మళ్ళీ ఈ కొత్త అతనికి నాకథ అంతా చెప్పాను. అంతకన్న ఆశ్చర్యంతో బాధ్యతతోనూ విన్నాడు.

"మీరెవరు?"" అన్నాను.

"నేను పోలీసు. అదృష్టమే, ఈ వుక్కకి నిద్రపట్టక ఇటు షికారువొచ్చాను. సరే వుండండి ఇక్కడే." అని వెడుతున్నాడు.

"ఇక్కడా? ఎట్లావుండను? నిద్రపోవొద్దా?"

"ఓ Taxi టాక్సీ తెప్పిస్తే—" అన్నానుమళ్ళీ.

"Taxi !!! అంటే?"

"అంటే...." తలగోక్కున్నాను.

"ఇక్కడ బావుండలేదా? చల్లనిగాలీ అదీ. పూర్ణో వుక్క. అదీగాక కష్టంసు ఆయన వొస్తేనేగాని రైలెక్కడానికి వీల్లేదు."

"ఎప్పుడు వొస్తాడు?"

"కబురు పంపుతాను. రేపు"

"అదేమిటి? ఎప్పుడూ వుండదా ఇక్కడ?"

"ఎందుకూ వుండడం? మీకు తొందరా?"

"కాదా?"

"ఎందుకు తొందర?"

"మావూరు పోవాలి."

"ఎవరన్నా మీవాళ్ళకి చాలా జబ్బుగా వుందా?"

"లేదు వెళ్ళాలి."

ఆశ్చర్యంగా చూశాడు. 'తొందర' అనేమాట విననట్టు.

"సరే కానీండి. తమాషా మనిషిలాగు వున్నారు. రండి" అని పక్కన ఇంకోచిన్న రెల్లుపాక దగ్గిరికి వెళ్ళి తలుపుకొట్టాడు. ఎవరూపలకలేదు, కాని తలుపు గట్టిగాతోస్తే వూడివొచ్చింది. ఆ గదిలో ఓ పాత టెలిఫోను వుంది. దానినిండా రెండు అంగుళాల ఎత్తున దుమ్ము. టార్చి లైటుతో ఓ చిరుగు పుస్తకంలో ఓ నంబరు వెతికి, డయల్ చేశాడు.

కొంచెం సేపటికి గంట మోగింది. ఏం చెప్పాలో కనుక్కుందామని చూస్తే ఆ పోలీసు లేడు. వెనక గదిలో ఎవరినో లేపుతున్నాడు.

ఎవరో నా చెవులో టెలిఫోనులో 'ఎవరు? ఎవరు' అంటున్నాడు.

"కష్టమ్సు మీరేనా?"

"అవును. ఏం?"

"పడవదిగి వొచ్చాను."

"అవతలపో. నిద్ర వొస్తోంది."

"రండి."

"వూరికే గోల చెయ్యకు. అర్ధరాత్రి ఏమిటీ వేళాకోళం."

నిజమని నచ్చచెప్పాను.

"గవర్నమెంటు ఎద్దుని పొలానికి తోలాము. నడిచి రావాలి. సరే కానీ" అన్నాడు.

ఇంతలో లోపల్నించి ఒకాయన వొచ్చాడు దీపంతో. మాసిపోయిన చొక్కామీద.

"టెలిగ్రాఫు ఆఫీ"సని రాసివుంది గోడకి.

"టెలిగ్రాం పంపుతారా?" అన్నాను ఆ కొత్త ఆయన్ని.

"టెలిగ్రాం? టెలిగ్రామేమిటి? ఎందుకు టెలిగ్రాం?"

"నేను వొచ్చానని మా బావకి...."

"ఎందుకు ఆయనికి!"

"మీ కెందు కదంతా?"

"పంపితీరాలా?"

"తప్పదు."

"వెంటనేనా?"

"వెంటనే....ఎప్పటికి అందుతుంది?"

"రెండు మూడు రోజుల్లో!"

"రెండు మూడు రోజులు? ఎందుకు"

"వాళ్ళందరూ ఆఫీసులో వుంటారా? ఎక్కడికి పోతారో, ఇళ్ళ దగ్గిర వుంటే తొరగానే అందుతుంది. మీ అదృష్టం. రాసి ఇవ్వండి పంపుతా. మళ్ళా రేపు వుండను."

ఓ కాయితం రాసి ఇచ్చాను.

"ఇదేం భాష?"

"ఇంగ్లీషు."

"మాకు తెలీదు."

టెలిగ్రాం బోర్డుమీద నుంచి గవ్వలం పెంటలూ, బూజూ అవీ దులిపి తీసి కొడితే, తుప్పు పట్టడంచేత అది కదలలేదు.

"పోనీలెండి, రేపు పెద్ద ఆఫీసునించి పంపుతాను."

"ఇంకా ఏం పెద్ద ఆఫీసు? ఈ ఊరికీ ఇది వొకటే ఆఫీసు" అని లోపలికి వెళ్ళి నూనె తీసుకొచ్చి ఆ మరలో పోస్తున్నాడు.

నాకు సందేహమొచ్చింది.

"ఇది బొంబే కాదా?"

"కాక!" అని, మెల్లిగా టెలిగ్రాం కొట్టడం ప్రారంభించాడు.

"అక్కడ తీసుకుంటున్నట్టు లేదు."

"ఎక్కడ?"

"మద్రాసులో, లేదు గావును!"

ఇంతలో కష్టమ్సు వొచ్చి నా కథనంతా విన్నాడు.

"సరే. పెట్టెల్లో ఏమున్నాయో చూద్దాం" అన్నాడు.

"యేమయ్యా, బట్టలమీద పన్ను వుందా?"

ఆయన బట్టలు కూడా పొట్టి ఇద్దరులాగూ, బనియనూ.

"ఇన్ని బట్టలు వీల్లేదు. సంవత్సరానికి అయిదు గజాలు .... ఇనేం బుడ్లు?"

"అత్తరు."

"అత్తరా? వొరే, అత్తరు పూసుకునేవాళ్ళు కదరా? దీనిమీద పన్ను వుందా? కస్టమ్సు పుస్తకం ఇంటిదగ్గిర వుండాలి .... సరేలెండి. ఇవేం బుడ్లు?"

"విస్కీ"

"విస్కీ! ఒరే విస్కీ అని విన్నాం కదరా చిన్నప్పుడు? ఏం చేస్తారు?"

"తాగుతారు."

"ఎందుకు తాగడం?"

"వుషారుకి."

"ఓ. సారా కాదుకద!"

"కాదు."

"కల్లు కాదా?"

"కాదు."

"ద్రాక్షాసవ కాదా?"

"కాదు."

"అయితే తీసుకుపొండి. ఈ అత్తరుబుడ్లు మాత్రం వీల్లేదు" అన్నాడు.

"ఎక్కడికి వెళ్ళను?"

"ఎక్కడికి వెళ్ళాలి?"

"గొబ్రెపూడికి. రైలెప్పుడు?"

"ఏం వారం ఇవాళ? శనివారం. ఇవాళ తెల్లారకట్టే మీ వేపు రైలు.

మళ్ళీ వారందాకా లేదు నా బండీ వొస్తుంది. దాంటో వెడుదురు గాని" అన్నాడు.

కాని పరిస్థితులు భరించలేక ఈ లోపల విస్కీ బాగా తాగడం వల్ల తరవాత ఏం జరిగిందో నాకు తెలీదు.

తెల్లారకట్ట లేచేప్పటికి రైల్లో ఉన్నాను. ఓ స్టేషనులో ఆగింది రైలు. కిందికి దిగాను. నా పెట్టె ఒక్కటే రైలంతా, ఇన్‌జన్ కూడా లేదు. నా పెట్టెలో ఓ ప్రక్కన ఎలెక్ట్రిక్ ఇంజన్ వుంది. అంతే.

అది చాలా పెద్ద స్టేషన్. పొట్టిలాగూ, బనియనూ వేసుకున్న వారే. అందరికీ ఒకటే బట్టలు. పోర్టరో, స్టేషనుమాష్టరో ఒకడు నుంచుని వున్నాడు ఆ స్టేషన్‌లో.

"కాఫీ ఎక్కడ?

"కాఫీ? దొరకదు."

"ఎక్కడ దొరుకుతుంది?"

"ఎక్కడా దొరకదు."

"రైలు ఇంతేనా?"

"ఇంతే. ఎవరూ ఎక్కరు."

"ఎందుకు ఎక్కరు?"

"ఏం పని? ఏ వూరికి ఆవూరికి స్వయం నిర్ణయం."

"ఆకలిగా వుంది."

"కొంచెం మజ్జిగ తాగండి."

"టీ!"

"అవన్నీ మానేశారండీ."

"కాఫీ, టీ ఎస్టేట్లు వుండాలి?"

"అక్కడ గొర్రెల్ని మేపుతున్నారు."

రైలు బైలుదేరుతోంది రమని నన్ను పిలుచుకుపోయినాడు డ్రైవరు. పదిగంటలకి నేనూ డ్రైవరు భోజనం చేశాము. టికట్లకిగాని భోజనానికిగాని డబ్బు ఇయ్యనక్కర్లేదు. మధ్యాహ్నం ఓ స్టేషన్‌లో ఒక నల్ల ఆయన ఎక్కాడు. తెల్ల రంగు, చిరిగిపోయిన పాతసూటు, హాటు, ఎక్కడో చూసినమొహం. ఆయనతో సంభాషించాను. ఎప్పుడు ఈ విపరీత స్థితిని అర్థంచెయ్యగల మనిషి దొరుకుతాడా అని ఆతృతపడు తున్నాను ఆయన పూర్వం కలెక్టరు. ఇంగ్లీషువాళ్ళు వెళ్ళిపోయినప్పుడు ఈయన వెళ్ళిపోలేదు, ఒక తెలుగు గొడ్లపడుచుమీద ప్రేమవల్ల. ఆ సంగతంతా నేను విస్కీబుడ్డి బైటికి తియ్యడంతోటే విరివిగా బైటపడ్డది. తేదీలు పోల్చిచూసుకోగా. నన్ను నాలుగోసారికి ఖైదుకి పంపిన అధికారి ఈయనే. అందువల్లనే నాకా ముఖ పరిచయం, విస్కీగ్లాసు చేతులో పట్టుకుని, ముక్కుకి రాసుకుని, నాలిక తడుపుకుని 'విస్కీ, విస్కీ, ఎన్నేళ్ళకి విస్కీ' అని మూర్ఛలుపోతున్నాడు. అధికారం చేతులోలేదు గాని, వుంటే గవర్నమెంటుకి రాసి, ఒక వందయకరాల సుక్షేత్రం నాకు రాసి ఇచ్చివేసును.

"తాగుడు అసలు దొరకదా ఈదేశంలో ?"

"ఎక్కడా! ఒక ప్రభుత్వంలో వున్నతోద్యోగులకు తప్ప. వాళ్ళకీ అంతా స్వదేశసరుకు, అదీ రహస్యం, దయతలిచి నాకోచుక్క పోస్తా వుంటారు పాత బారుమిత్రులు" అన్నాడు.

ఇంతలో షోలాపూరు వొచ్చాం. ఊరులేదు. పెద్ద స్టేషను అట్లానే వుంది. I & II Class ladies waiting room ఫస్ట్ క్లాస్ లేడీస్ వెయిటింగ్‌రూం. లో స్టేషన్‌మాస్టరు తన గేదెల్ని కట్టేసుకున్నాడు.

"ఏమిటీ మార్పు ?" అన్నాను. నా సంగతంతా ఆయనతో చెప్పిం తర్వాత.

"ఏంలేదు. పల్లెటూళ్ళు స్వయం నిర్నయమై పోయినాయి. పరిశ్రమలన్నీ కుటీరాలలో చేరాయి. మిల్లులు మూసేశారు. పెద్ద పెద

పట్టణాల్లో తిండిలేదు. బియ్యంకూడా పట్టణాలకి ఎగుమతి మానారు. వాణిజ్యం అసలులేదు. తిండిలేక అందరూ పల్లెటూళ్ళు చేరుకున్నారు."

"ఈ రైలూ...."

"ఒక్క-రైలేమిటి; చూశారా ఆ కార్ల అస్తిపంజరాలు ! ప్రయాణం చెయ్యవలసిన అవసరంలేదు. డబ్బూలేదు, ఎరువులుళ్ళమాత్రం మిగిలాయి."

"మీరూ ?"

"నేను పిన్నులూ, ఇంగ్లీషు ఆటబొమ్మలూ, జలుబుమందూ అమ్ముకుంటున్నాను. మూసేస్తున్న ఓషాపు కొనేశాను. కాని ఎవరూ కొనటంలేదు."

"ఎందుకు కొనరు ?"

"డబ్బులేదు"

"ఎందుకులేదు ? ఇంగ్లీషు దోపిడి ఆగిందికదా ?"—

"నాకు ఆర్థికశాస్త్రం రాదు. తిండికీ కరువులేదు. ఇంకదేనికీ డబ్బులేదు. ఈ స్వయం నిర్ణయంలో వర్తకం పడుకోడంవల్ల డబ్బు పుట్టటంలేదు."

మనిషికి అవసరాలు ఎక్కువ చేసుకున్నకొద్దీ ధనం ఎక్కువవు తుంది. తగ్గించుకొన్నకొద్దీ బీదతనం వొస్తుంది.

"ఇప్పుడు కాంగ్రేసేనా పరిపాలన ?"

"ఆ అదొక్కటే. ఇంకేపార్టీ లేదు."

"కమ్యూనిస్టులూ ?"

"కమ్యూనిస్టుల దెబ్బకి దడిసి, వాళ్ళ పద్ధతుల్ని కాంగ్రెస్ తానే ప్రవేశపెట్టడం మూలాన, వాళ్ళు కాంగ్రెసుతో కలిసిపోయినారు."

"మహమ్మదీయులు ?"

"వాళ్ళా! ఈ స్వయం నిర్ణయ పద్ధతితో వాళ్ళూ అణగారిపోయి నారు. దున్నుకుంటేనేగాని తిండిలేదు. నొడుక్కుంటేనేగాని బట్టలేదు. కట్టుకుంటేనేగాని ఇల్లులేదు, పొద్దస్తమానం దున్ని, వొడికి, వండి, ఇంకా, ఏం పోట్లాడతారు? వాళ్లెక్కడా కనపట్టంలేదు. పంచ లెగకడితేగాని, లాగులతో, గడ్డాలతో ఏం దున్నుతారు? ఎద్దులతో పొలంలో స్నేహమై వాటిని చంపడం మానేశారు. అదీకాక, మనిషికి రెండెద్దులూ ఒక ఆవూ కోటా. ఎంత నోరూరినా, ఆ ఎద్దుని వొండుకుంటే పొలం దేంతో దున్నుతాడు?"

"ఇప్పుడు ఎవరు పరిపాలిస్తున్నారు?"

"ఎవరూలేదు. ఎలెక్షన్లు ఏడేళ్ళ క్రిందట జరిగాయి. మళ్ళీ జరగ వలసిన ఆవశ్యకత కనిపించలేదు. కౌన్సిలుసెషన్లులేవు. ఆ మంత్రులు అప్పుడప్పుడు ఆఫీసుకువొచ్చి, గవర్నమెంటు వొంటెద్దు బళ్ళలో ఇంటికి వెడతారు."

"కార్లూ...."

"పెట్రోలు తెప్పించరుగా. అదిగాక వేగంగా జరగవలసిన పను లేవీలేవు."

"మరి హిందువుల పూజలూ దేవాలయాలూ?

"హరిజనులు ప్రవేశించడంతో తక్కిన హిందువులు మానేశారు, దేవాలయాలకి వెళ్ళడం. అందువల్ల అవసరం కనపడక హరిజనులూ మానారు. Strict స్ట్రిక్ట్ రేషన్‌వల్ల పండగలకి ఏమీ వొండుకోడానికీలేదు. ఇతరులకి పెట్టడానికీలేదు. ఎక్కడికి పోయినా అదేతిండి, పూజలు దేనికి చెయ్యడం? ఏ ఆపదలూ, భయాలూ, వ్యాధులూలేవు. ప్రార్థించి తెచ్చుకో వలసిన ఆస్తులూ, ధనాలూ, గొప్పలూ ఏవీలేవు."

"కాఫీ దొరకదేం?"

"మద్యపాన నిషేధంతో, కార్మికులకి కోపంవొచ్చి వోటుచేసి, పొగాకూ, కాఫీ, టీ, మాన్పించారు. కల్లు తాగనివాళ్ళని."

"మరి ఏం మిగిలింది !"

"ఇదీ" అన్నాడు చుట్టూచూపి.

రైలాగితే దిగివెళ్ళాడు.

తోవపొడుగుతా దేశంలో సమృద్ధి కనపడుతోంది. ముష్టివాళ్ళు బీదవాళ్ళు కనపడరు. పాటలు పాడుతూ పొలాలలో పనిచేసేవాళ్ళు, బాగా బలిసిన గొడ్లూ, చక్కని పూరిఇళ్ళు కనపడుతున్నాయి. కాని ఏదో లోపం పెద్దలోపంవుంది. గాలిలో.

ఒకరోజు తెల్లారకట్టకి చేరుకున్నాను గొర్రెపూడి. టెలిగ్రాం అందిందట, మా బావ వొచ్చాడు రైలుదగ్గరకి. స్టేషన్‌లో ఎవరూలేరు. మావాడి రెండెడ్ల బండీమీద నా పెట్టెలు పడేసి బైలుదేరాము. వెన్నెలగా వుంది.

మావూరు స్వరూపమే మారింది. చక్కని గుంటలులేని రోడ్డు చుట్టూ, తోటలూ పైర్లూ, ఒక్కరవ్వ చెత్త. మురికి ఏమీలేవు. మా బావగాడుకూడా బనియనూ చెడ్డీ వేసుకుని నాడ్రస్సు వంక వింతగా చూస్తున్నాడు.

"అందరూ ఎట్లా వున్నారురా !"

"బాగానేవున్నాం."

"దేశమంతా సుభిక్షంగా హాయిగా వున్నట్టుంది ?"

"వుంది" అని మెల్లిగా మూలిగాడు.

వూరిదగ్గిరగా వెళ్ళాము. ఈలోపల నాసంగతంతా అడుగుతాడను కున్నాను మా బావ, నన్ను కలుసుకోడం వాడికి చాలా సంతోషంగా వున్నట్టుంది కాని నాసంగతి ఏమీ అడగడంలేదు. రాత్రంతా నిద్రలేక తల దిమ్మెక్కినవాడిమల్లే వున్నాడు.

వూరిదగ్గిరికి వొచ్చేటప్పటికి తెల్లారుతోంది. పాటలు పాడుకుంటో

మొగవాళ్ళు పొలాలకి పోతున్నారు. ఆడవాళ్ళు గుమ్మాలు వూడుస్తున్నారు.

"చాలా పెందరాళే లేస్తున్నట్టున్నారే!"

"అవును. పెందరాళే పడుకుంటారు.

ఇంటికి చేరుకున్నాము. వెంటనే మా బావ పొలానికి వెళ్ళి పోయినాడు. నాతో మాట్లాడే తీరుబడన్నా లేకుండా మా చెల్లెలు వూడవడం అంట్లుతోమడం మొదలైనపనులు చేస్తోంది.

"బైటికిపోవాలి" అన్నాను.

చెంబూ, నీళ్ళూ పారా చూపించారు.

"గాంధీగారి పాకీదొడ్లు పెట్టేశారా ఏమిటి?" అన్నాను.

సిగ్గుతో తలొంచుకు వెళ్ళిపోయింది మా చెల్లెలు.

మా మేనల్లుడు బడికి తయారౌతున్నాడు.

"ఎన్నోక్లాసు చదువుతున్నావోయ్?"

తెల్లబోయి చూశాడు నావంక.

"ఏమిటి? అట్లా చూస్తావు?"

"క్లాసు చదవడమేమిటి?"

నా తప్పు తెలిసింది. క్లాసుని ఎట్లా చదువుతారు?

"ఎన్నోక్లాసులో వున్నావు?"

"వుండడమేమిటి? క్లాసు చదవడమేమిటి? నాలుగోక్లాసు వాడుకుతున్నాను."

"ఓ? అదీ పెట్టారన్నమాట! సరే. మీ బడికి వొచ్చిచూస్తాను?"

"బళ్ళోవుండం."

"వుండరా?"

"పొలానికిపోతాము."

"పోయి?"

"పండిస్తాము."

"అదీ పెట్టారన్నమాట."

"ఇదిచూడు మామయ్యా" అని గర్వంగా ఒక అట్ట చూపించాడు.

దానిమీద వాడిపేరూ, వయసూ $\frac{43\frac{1}{2}}{62}$ — I — $\frac{39}{9}$ — II — $\frac{52+6}{4}$ — III

"అంటే?"

"ఒస్. ఇదేతెలీదా? 62 నంబరునూలు 43½ గజాలు వొడికాను పోయిన పరీక్షలో 9 అంగుళాల లోతున 39 గజాలుదున్నానుఅరగంటలో 4 నెలల్లో 52 వంకాయలు 6 వీశలు తూగేవి పండించాను అన్నమాట."

"నీకేమన్నా పుస్తకాలు వున్నాయా?"

"లేవు."

"రాయడం, చదవడం చెప్పరా?"

"ఆరో క్లాసులో ప్రారంభిస్తారుట."

అంటో వెళ్లిపోయినాడు.

చెల్లెలు పేడచేస్తోంది.

"పనిమనుషులు దొరకరా?"

"దొరక్కేం? ఆ మాట విగ్గిరగా అన్నావంటే ఇరుగుపొరుగునించి గుమికూడతారు. ఈ పని లేకపోతే ఇంకేంతోస్తుంది?"

వూరువెంబడి బైలుదేరాను చూద్దామని. అంతా శుభ్రంగావుంది కాని ఎవరూ బైట కనపట్టంలేదు మనుషులు. ప్రతి ఇంటోంచీ రాట్నాల ధ్వనీ, వంటల అట్టహాసమూ వినబడుతోంది, ఇళ్ళకి తలుపులులేవు.

"ఈ వూళ్ళో హోటలు లేదా?"

"లేదు. ఎందుకు? మా ఇంటో భోజనంచేస్తారా?" అని ఆశగా అడిగాడు ఆ పెద్దమనిషి.

"కాదు. కాఫీ, ఇడ్లీ...."

"ఏమిటవి!"

"ఓ, భోజనశాల హోటలువుందా?"

"ఎందుకు హోటలు? ఎవరి ఇంటోనన్నా భోజనం చెయ్యొచ్చు. ఆఫీసులో చెపితే సరికాని ఎవరుచేస్తారు ?" అన్నాడు మళ్ళీ దిగులులోపడి

ఆ వూరికంతా ఒకటే ఆఫీసు. అంటే ఒక స్టోర్సు. ఆఫీసు ఎప్పుడూ మూసేవుంటుంది.

అక్కడో గుమాస్తా ఆవాలు లెక్కపెడుతున్నాడు.

"ఏమిటది?" అన్నాను.

"ఇంకేం పనిలేక....మీరేనా ఈ వూరికి కొత్తగా వొచ్చినవారు?" అన్నాడు వింతగాచూసి దిగులుపడుతూ.

"చెప్పాడులెండి మీ బావగారు" అని అవాలు లెఖ్కపెడుతున్నాడు మళ్ళీ.

"ఓ వంద కుప్పగాపోసి.

"ఏమన్నా కొనడానికి వొచ్చారా? తీసుకోండి కొలుచుకుని, డబ్బు ఇక్కడ పడెయ్యండి" అన్నాడు.

ఆ వూళ్ళో వండనివి, చింతపండు, బెల్లం, మెంతులు, ఉల్లిపాయలు మొదలైన సరుకులు వున్నాయి.

నిర్జనమైన వీధుల్లో అట్లా తిరిగి ఇల్లు చేరుకున్నాను. మా బావ వొచ్చాడు స్నానంచేసి భోజనానికి లేచాము. భోజనం మామూలుగానే వుంది. వంటింటో ఒక బోర్డువుంది. దానిమీద,

అన్నం—అర్ధశేరు—200 కాలరీలు.

పప్పు—8 తులాలు—50 కాలరీలు.

వంకాయకూర—8 తులాలు—10 కాలరీలు.

గోంగూరపచ్చడి—4 తులాలు—2 కాలరీలు.

గేదెపెరుగు—12 తులాలు—100 కాలరీలు.

అని వ్రాసివుంది.

"ఏమిట్రా ఇది?" అన్నాను.

"అంతే సంగతి. అన్నీ కాలరీలే వొప్పుకుంటారు మనిషికి."

"ఎక్కువ తింటే...."

"అంతే ఇస్తారు సామగ్రి."

"ఈ రాత ఎందుకు?"

"వొచ్చి చూస్తారు ఆహార ఆఫీసరు. అందుకని అందరూ 11, 12 మధ్య భోజనం చేసితీరాలి."

"మనకి కావలసినవి కొనుక్కుంటే...."

"ఎక్కడకొంటావు? అన్నీ కొనుగోలు సంఘాలలోంచి సప్లయి. వర్తకులూ దుకాణాలూ లేవు. ఒక్క గవర్నమెంటు స్టోర్సులోనే దొరుకుతాయి. వంటవొస్తువులు అమ్మరు. కావలసినదానికన్న ఎక్కువ పండించకూడదు."

"తక్కువపండే ప్రదేశాలలో?"

"అన్ని ఇరిగేషన్ Projects ప్రాజెక్టుల వల్ల అన్నిచోట్లా పండుతాయి. పండనిచోట్లకి గవర్నమెంటు Farms ఫార్ముల నించి సప్లయి."

"చాలాగొప్ప ఏర్పాట్లు చేశారే!"

"అవును."

"పోనీ ఎక్కువ పండించుకుని. ఎక్కువ తినకూడదా?"

"భూమి ఏదీ! అంతా సరిగా పంచేశారు."

"మరి కొత్త వ్యవసాయ పద్ధతులమీద.... Tractor, ట్రాక్టర్ ఎరువులూ అవీ పెట్టి, పండించ కూడదూ అమెరికాలో మల్లే?"

"Tractor ట్రాక్టర్ మెషిన్లు. వీల్లేదు. ఎక్కువగా పండించి ఏంచేసుకోము? ఎవరిపంట వారికే వుంది.

"మీరే తింటేనేం?"

"తప్పకండా అవసరమైనదానికన్న అనుభవించకూడదని రాజకీయ నియమం"

మధ్యాహ్నం వొంటిగంటకి వాళ్ళు బైలుదేరి నన్నూ రమ్మన్నారు. రానన్నాను. హాజరు తీసుకుంటారు. ప్రతిమనిషి వెళ్ళి తీరాలన్నారు.

"ఎక్కడికి?"

"టౌను హాలుకి."

"ఎందుకు!"

"కాలక్షేపం."

ముందు ఒకతను హిందీలో భారతమాతని ప్రార్థించాడు. తరువాత ఆ వూరికవి తాను మిమములమీద రాసిన పద్యాలు వినిపించాడు.

తరువాత ఒక యోగప్రదర్శనం, వ్యాయామ ప్రదర్శనం ఆ వూరి వాళ్ళు చూపించారు. మా బావ కునికిపాట్లు పడుతున్నాడు.

"చూడవేంరా?"

"రోజూ ఇదే! ఎన్నేళ్ళు చూడను?"

తరువాత ఓ కథకుడు, కాకిమీద కథ చదివాడు.

రేడియో తిప్పారు.

ప్రార్థనపాటా, పంటల్ని గురించి సలహాలూ, తరువాత నీతి ఉపన్యాసాలూ, రైళ్ళ రాకపోకలూ, కొన్ని లాలిపాటలూ, పతివ్రత పాటలూ,

తరువాత దేశవార్తలలో, ఉద్యోగస్తుల ఆరోగ్య విషయాలు చెప్పారు. అందరూ నిద్రగా దిగులుగా కూచునివిని తలవొంచుకుని ఇళ్ళకి వెళ్ళిపోయినారు. సాయంత్రం నాలిగింటికల్లా మొగవాళ్ళు పొలాలకి వెళ్ళిపోయినారు. ఆడవాళ్ళు పశువులదాణాలూ, బట్టలు వుతకడాలూ, వంట ప్రయత్నాలూ చేస్తున్నారు. సాయంత్రం షికారు వెళ్ళాను గాని వూళ్ళో పిల్లలైనా కనపళ్ళేదు. రాత్రి ఏడింటికీ ఇల్లు చేరుకున్నాను.

ముందు మేనల్లుడు వొచ్చాడు. నేను పెట్టె సద్దుకుంటో వుంటే తా నెప్పుడూ చూడని వొస్తువుల్ని చూసి అవేమిటని ప్రశ్నిస్తున్నాడు.

"ఏం చదివావు ఇవాళ?"

"చదవడమేమిటి? చదవడం."

"చరిత్రనేర్చుకుంటారా మీరు?"

"నేర్చుకుంటాం."

"ఏం చరిత్ర! అక్బరు ఎవరు చెప్పు."

"విన్నానులే అక్బరూ, అశోకుడూ, విక్రమాదిత్యుడూ, కృష్ణ దేవరాయలూ వీళ్ళందరూ బుద్ధి తక్కువవాళ్ళు. బీదల్ని దోచుకున్నారు. యుద్ధాలుచేసి ప్రజల్ని చంపించారు. పంటల్ని నాశనంచేశారు. ధనికుల్ని ఇంకా ధనికుల్ని చేశారు."

"అయితే మీరు చదివే చరిత్ర ఏమిటి?

"విప్లవయోధులూ, కర్షకవీరులూ...."

"ఎవరువాళ్లు?"

"వాళ్ళ పేర్లు తెలీవు, మొదట ఎప్పుడు ఎవరు విత్తనాన్నినాటారు? ఆవునించి పాలుతీసి పెరుగు చేశారు? ఇట్లాంటివి. పత్తినించి నూలు తీసిందెవరు? వాళ్ళు అసలు గొప్పధన్యులు."

"ఎవరువాళ్ళు?"

"అదే రిసర్చి చేస్తున్నాము.'

"ఎట్లా?"

"చేస్తాం. అంటే ఆలోచిస్తో వుంటాము."

"వుండి?"

"ఆలోచిస్తాము, ఎప్పటికో కొత్తచరిత్ర సృష్టిస్తాము."

"పోనీ-సయన్సు నేర్చుకుంటారా?"

"ఎట్లా?"

"చూస్తాం, పరిశీలిస్తాము."

"ఏం చూస్తారు?"

"అన్నీ, ఆకాశం, అడవులు, పైర్లు, పిల్లులు."

"చూస్తారా? ఇదివరకు చూడలేదా?"

"ఇప్పుడు పరిశీలిస్తాం."

"ఎట్లా?"

"అట్లా చూస్తాం మిడతని చూస్తాం. అట్లా — చూస్తోవుంటాం. మిడతకి కాళ్ళున్నాయి, కడుపువుంది, కీళ్ళున్నాయి, ఇట్లా — మర్రిచెట్టుకి వూడలున్నాయి. ఇట్లాంటివి తెలుసుకుంటాం. అన్నిట్లోకీ ముఖ్యం పత్తిమొక్క."

"పత్తిమొక్కని పరిశీలించి ఏం తెలుసుకున్నావు?"

"పత్తికాయలోంచి పత్తివొస్తుందని."

"అది తెలీదా?"

"పూర్వం మీరు చదివేవారు, ఇప్పుడు చూశాము. ఆకాశం నీలంగా వుంటుంది. ఎంత వేడిగా వుంటుంది? ఇల్లాంటివి."

"ఏమన్నా లెఖ్ఖలు చేస్తారా?"

"ఆ. గంటకి ఎన్నిగజాలదారం ఎంతనూలు ఎంతబట్ట అవుతుంది?"

"డబ్బులెక్కలు చేస్తారా?"

"అలాస్కాలో కూలీలు ఎంత సంపాయిస్తారు? వాళ్ళకి రోజుకి ఎంతఖర్చు? ఎంత తగ్గించడానికి వీలుంది?"

"అలాస్కా? ఎక్కడవుంది?"

"అదక్కర్లేదు."

"భూగోళం చదవరా?"

"చదవం. చూస్తాం. ఈ కాలవ అవతల ఏముంది? కుమ్మరి కుండలు చేస్తాడు. ఈ వూళ్లో కాకులు వుంటాయి. ఇవన్నీ."

ఇంతలో నన్ను భోజనానికి పిలిచారు.

ప్రతి ఇంటిలోనూ ఎలెక్ట్రిక్‌లైట్సు, శుభ్రంగా వున్నాయి ఇళ్ళు. పాత ఆచారాలన్నీ పోయినాయి.

భోజనమైనాక వరండాలో కూచున్నాము నేనూ మా బావా. కొత్త మార్పుల్ని గురించి చెపుతున్నాడు దిగులుగా. కుర్రాడు కూచున్నాడు రోడ్డు కేసి చూస్తో. ఇంతలో ఒకాయన వొచ్చాడు. ఆయన ఆ వూరి కంతటికీ అధికారి. కొత్తగా నేనువొచ్చాను గనుక నాసంగతి రాసుకోడానికివొచ్చాడు దేశానికి వొచ్చిన ఈ మార్పుసంగతి చాలాసేపుమాట్లాడుకున్నాము. పూర్వ కాలం వుండే శారీరక మానసిక వ్యాధులు చాలావరకు తగ్గాయి. ఈర్ష్యలు, పోటీలు, ముందు ఎట్లా బతకడమనేభయం. పిల్లలేమౌతారనే అదుర్దా, ధనార్జన, ధనం కూడపెట్టడం, ఆస్తి సంపాయించడం ఇటువంటి బాధ లన్నీ పోయినాయి నిశ్చయంగా. అధికారులకి బానిసత్వం, ప్రభుత్వభయం, నీచత్వం, మోసం మొదలైనవి లేనేలేవు.

"అంటే రామరాజ్యం - భూలోక స్వర్గమన్నమాట? అన్నాను.

"ఊ" అని మూలిగాడు.

"ఏం?" అన్నాను.

"స్వర్గంకూడా ఇట్లానే వుంటుందేమోనని భయం" అన్నాడు మా బావ.

"ఏమీ? అదేకాదా మనం కలలుకన్నది? మతాలన్నీ ఆశపెట్టింది? నిరంతరశాంతి. ఈ భూమిమీద జీవితపుజ్వరం తరవాత ఆలోకంలో శాంతి అనేకద! ఆ శాంతి ఇక్కడే కలిగితే ఇంకేం కావాలి."

"అవును. ఇక్కడ ఈ లోకంలో అశాంతీ, తీరని కోర్కెలూ వున్నంతకాలం, అవన్నీ ఆలోకంలోవుండవని, సత్యం, శాంతి, సౌఖ్యం, ఇవన్నీ అక్కడ వుంటాయని కలలు కన్నాము. కాని అవన్నీ ఈలోకం లోనే లభ్యమైతే, కలలుకనడానికి ఏమీ మిగలలేదు.

"నేను చూసిందేమిటంటే, ఇంతశాంతి, ధర్మం, ఏర్పడినా మనుషుల్లో ఉత్సాహమూ, కళా, కనపడవేం? ఏదో నిద్రపోతున్నట్టూ, ఏం చాతగాక ఇటూ అటూ వెతుకుతునట్టు పదేళ్ళమట్టి పంజరాల్లో కాలం గడిపిన పిట్టల్లాగ కనపడతారేం మనుషులు ఎంతకాలంనించి కలలు కన్నాం ఈ శాంతికోసం?"

"కాని పనిభారం పొద్దస్తమానం పని."

"ఎక్కువ పనివున్నట్టులేదు" అన్నాను.

"లేదు. కాని ఉన్నపని భారం. పనిలోనించి పని తప్పించుకునే ఆశవుండాలి. గానుగ ఎద్దుమల్లే జన్మఅంతా ఇదే అని అనుకుంటే, పని భారమౌతుంది. ఎంత కొంచెమైనాసరే. పూర్వం కుర్రాడు II పారం చదివేశాడు. పై క్లాసులకి వెళ్ళినా వెళ్ళకపోయినా, వెడతాం. మార్పు వుంటుంది అనే ఆశవుండేది. జీవితమంతా ఇవే చదవాలని నిబంధనవుంటే ఏమవుతాడు? మానవ స్వభావం విచిత్రం. దాన్ని అంకెలలోకీ ఫార్ములాల లోకీ మార్చి యోచించడం బుద్ధితక్కువ, పనికావాలి. పనీ అక్కర్లేదు. ఇప్పుడు మనిషికి పనితక్కువ పనికావాలని వుంటుంది. కావి ఉన్నపని భారం."

"కాని సరదాలులేవు, పాడతారు' కాని అదీ భారంగానే." "పత్రికలు, పుస్తకాలు, సినిమాలు, పాట కచేర్లు, ప్రదర్శనాలు, ప్రయాణాలు ఇవన్నీ ఏమైనాయి."

"మొదలు డబ్బు తక్కువ. రెండోది, కీర్తి, వానిటీ, మెప్పూ, ఇట్లాంటివి కొన్ని అవసరం మనుషులకి. ఎందుకుపాడాలి? నాటకాలాడాలి? ప్రదర్శించాలి? ఘనతకి. ఇప్పుడు చూస్తాం. కాని ఘనతనివ్వడం. నీకది చాతనవును. ఐతేనేం? మాకెందుకు అనిపిస్తుంది. అందువల్ల ప్రోత్సాహంలేదు.

అన్నిటికన్న, జీవితానికీ కళకీ సంబంధం వుంటేనేగాని కళని అనుభవించలేము. ఈ జీవితంలోంచి ఏకళారాదు. స్ట్రగుల్. యత్నం వుండాలి. ఎవడన్నా కళను కల్పించినా, అది ప్రజలకు రుచించదు.

ఆకలివుంటేగాని భోజనంరుచి అనుభవించం. బిచ్చగాడికైనా కలలు ఇంకోకానీ ఎక్కువ దొరుకుతుందని, దొరికితే సంతోషం, ఈ జన్మలో ఏంలేకపోతే, ఆ లోకంలో, వొచ్చేజన్మలో. పల్లెటూళ్ళనించి ఏడాదికోసారైనా పట్టణానికిపోయి, ఓ రెవిక కొనుక్కోడం, Competition కాంపిటేషన్ యీర్ష్య, వ్యభిచారం ఇవన్నీపోతే జీవితం ఇట్లా అయింది. కుర్రాడికీ తండ్రికీ కూడా ఎన్ని కలలు, 'పెళ్ళిళ్ళ కట్నాలు' పోయింది ఆకాలం.

పూర్వం సర్వసంపన్నుడైన వాడికి జీవితం ఎంత అర్థవిహీనంగా వుండేది. ఏం తోచేదికాదు, యత్నమూ, కోర్కె, ఆశయమూ లేకపోవడం వల్ల ఇప్పుడు ఆ తోచకపోవడం, అర్థంలేకపోవడమనే బాధ సర్వ సామాన్యమయింది. ఇప్పుడు సినీమాలు ఎవడూ చూడడు, ఆ సినీమాలలో ఏ బాధలూ, ఏ ఆశయాలు, ఏ అందాలు చూపినా, వాటికీ జీవితానికి సంబంధంలేదు. ఆ కారణం, ఆ బాధలు వొస్తాయని భయములేదు. ఆ అందాలు చిక్కుతాయని ఆశాలేదు."

"మరి రొమాన్సు ఏమయింది? వ్యభిచారమన్నా లేదా?"

"అదీ అణగారిపోతోంది. దేహాలు అమ్ముకోవలసిన అవసరం లేదనుకోండి. జీవితపు రంగులమీదా, రహస్యాలమీదా ఎప్పుడు ఉత్సాహం తగ్గిందో అప్పుడే ఈ యత్నాలన్నీ తగ్గేట్టున్నాయి."

"ఏం జరిగిందంటారు?"

"ఏంలేదు. కొడుక్కి పాతికేళ్ళువొచ్చి చాలా అప్పుల్లోకీ తగాదాల్లోకీ, జూదాలకీ దిగాడనుకోండి. అతనిమీద జాలిపడి తండ్రి, పిల్లవాడివిగా ఉన్నప్పుడు ఎంతశాంతంగా సంతోషంగా, నిర్మలంగా వుండేవాడివి!" అని బలవంతంగా తండ్రి బొమ్మలూ అవీ ఇచ్చి ఆడుకోమంటే అతనేమాతాడో దేశమంతా అట్లా ఐనట్టుంది" అన్నాడు.

# హిందూ - ముసల్మాన్

ఎడతెగని మైదానం. ఉత్తరానికి కొండలు తప్ప ఏమీ కనపడవు. అక్కడక్కడ ముళ్ళపొదలు, ఆకులు పిండినా ఒక్కచుక్క రసంరాదు.

ఆ గుంపులో కొద్దిమంది ధనవంతులు, సంస్కారులు, జ్ఞానులు, చాలామంది కటికబీదలు ఎండనెరగని గోషాస్త్రీలు. ఆకలి నెరగని పసిపిల్లలు. సామానులేదు, మూటలు లేవు, ఏమీలేవు. మైదానపు ధూళి ధనవంతుల్నీ, బీదల్నీ, భేదంచూపక, కప్పేసింది. కళ్ళనిండా, ముక్కులనిండా కూడా ఎర్రనిదూళి. యువకుల వొంటికి గాయాలు, నెత్తురు ఎండి నల్లగా గడ్డకట్టిన గాయపు పుళ్ళు. కట్లు, ఒకామెకి రొమ్ములుకోసిన గాయాలు, ఒకామెకి అసలు కళ్ళేలేవు. గొప్ప సౌందర్యం ఒకామెది. ఏ దేశపు రాణి ఈమె అనుకుంటారు. ఇప్పటికీ లొంగని ఆమె ఠీవినిచూస్తే, ఎంతకాలంనుంచి నడుస్తున్నారో, వెనక పడేవారిని తోసుకుంటూ తివాసీలపైన మొహమల్ జోళ్ళతో నడవడం భారమనుకున్న ఆ పాదాలతో.

"ఎప్పుడు ఇంటికి వెడతాం?" అని ఏడ్చింది తొడలు గాయమై నడవలేని ఓ పిల్ల.

"అల్లా!" అని. బిగ్గరగా మైదానం అదిరేలాగు ఏడ్చింది ఓ ముసలమ్మ. ఆమె దవడ నిలువునా చీలివున్న సంగతి మరచి, బాధవల్ల చప్పున ఆగింది ఆ ఆర్తనాదం.

"వూరుకో, అరవకు" అని విసుక్కున్నాడు చెయ్యితెగిన ఆమె మనమడు యూసఫ్.

ఎంత మంటపెట్టినా అంటుకోని తన రాతిగోడల మందిరాన్ని తలచుకుంటున్నాడు అతని తండ్రి జాగీర్‌దార్.

"వాడు నల్లటివాడు. వాడే అసలు నువ్వు చచ్చినాసరే, వాణ్ణి ఓ పోటు పొడవగలిగి వుంటే నాకీస్థితికూడా ఇంతబాధగా వుండకపోను" అన్నాడు యూసఫ్‌తో.

"మన సఫేరాని—" అని గబగబ యేడ్చాడు యూసఫ్.

పది నిమిషాలు తంటాలుపడి యేడుపుని మింగి "దూకాను ఆ కాఫర్‌మీదికి. కాని, మధ్యలో మన సఫెరాని—ఒకడు—నా ముందే లంగా చించేసి—"

వేళ్ళు తిమ్మిర్లెక్కాయి. పైకికిందికి ముడుచుకున్నాడు. పడమటి సూర్యుడికేసి చూశాడు.

వెనకనించి "సఫేరా" అని పెద్ద కేకవేసి పడిపోయింది ఒకామె.

ఎట్లా? దోవ పొడుగువా ఇట్లా ఈ ఆడవాళ్ళు పడిపోతూవుంటే..."

ఎక్కడన్నా వూరు కనపడుతుందా? ఎట్లా సమీపించడం? గుర్తు పట్టడంతో నరికేస్తారు. ఇదంతా హిందూరాజ్యం.

ఆమెకోసం అందరూ విశ్రమించారు. మొహాన చల్లడానికైనా నీళ్ళులేవు.

"ఈవాళ నవాబ్, రేపు చప్రాసీ: ఎంతచిత్రం అల్లాలీల" అన్నాడు ఒక ముసలి సాహెబు నాలుగు ఈకెల గడ్డాన్ని ఆడిస్తో!

"ఏం చేశాం? వాళ్ళకేం అపకారం చేశాం? ఎందుకు మనపైన ఇంతకసి?" అని దిక్కుల్ని అడిగింది ఒక యవ్వనవతి. ఎన్నడూ పత్రికలు చదవవలసిన అగత్యం పట్టని పుణ్యవతి. తన ఎదురుగా తన భర్తని కట్టి, తనని అవమానంచేసి, అతని గుడ్లని ఊడబెరికిన చిత్రవధ దృశ్యాన్నిచూసి కూడా బతికి వున్నానే అని ఆశ్చర్యపడే ఆ యువతి.

ఆ మూర్ఛపడ్డ ఆమె పిలుస్తోంది.

"యాసేన్, టీ తీసుకురా." అని.

దాహం కాబోలు.

"చంపుతా. ఆలస్యం చేశావంటే—నా కొడుకుతోనుటే నీకు సల్లాపాలు?"

యాసేనూ, కొడుకూ—ఏ లోకంలో సల్లాపాలాడుతున్నారో తన భయంలేకుండా ఇప్పుడు.

నల్లటివాడు, భయంకరుడు, క్రూరుడు, కుడిచెయ్యి కొత్తగా తెగిన అమనుల్లా, ఎడంచేత్తో కత్తిపట్టుకుని వెర్రెత్తినవాడిమల్లె అరుస్తున్నాడు: "ఈ కత్తికి వెయ్యిమంది సిక్కుల్ని బలివ్వకపోతే నేను హూస్సేన్ బీబీకి పుట్టలేదు" అంటూ అటూ ఇటూ పరిగెత్తాడు.

పదిమంది ప్రాణావశిష్టులైన ముసల్మాన్ యువకులు అరిచారు అతనివెంట హీనస్వరాలతో.

"ఇదే అల్లాముందు నా ప్రమాణం. ఈసారి మొదట నా కంటపడ్డ హిందూ సువ్వర్ని చంపకపోతే నా మొహం చూడకండి" అన్నాడు యూసఫ్.

"సెబాస్. సెబాస్" అన్నారు స్త్రీలు, నిప్పులుకక్కే కళ్ళతో ద్రౌపతీ అవతారాల్లాగ.

ఈ ముసలమ్మ మూర్ఛవల్ల నయే ఆలస్యానికి ఆతురత పడుతున్నారు తక్కిన మనుషులు: ఆ శ్రీమంతురాలి చురుకు నాలికవల్ల ఎన్నో ఏళ్ల ఊపిరాడని పక్క ఇంటివాళ్ళూ ఆమె పారేసిన ధర్మంతో బతికిన దరిద్రులూ కూడా.

"ఈమెకోసం ఆలస్యమైతే అందరం చస్తాం" అన్న గుసగుసలు.

ఆకలి, దాహం, గాయాలబాధ! ఎక్కడా శరణ్యంలేదు. ఎటు చూసినా అపాయం. అబ్బా, ఈ ప్రాణం నిలుపుకోవాలనే పట్టు!

నాలుగు పరకల గడ్డపు ముసలివాడు యోచిస్తున్నాడు!

"ఎట్లానూ మరణం తప్పదు మా అందరికీ, ఎప్పుడో కాదు, రేపో, ఎల్లుండో, శత్రువులన్నా చిత్రవధ చేస్తారు. కాకపోతే నీళ్ళులేక, తిండిలేక ఒక్కొక్కర్మే దిగబడతాం ఈ ఎడారి మట్టిలో. కాని ఎంత ఆశ! ఎంత పట్టు ప్రాణం! ఆ చివరి నిమిషం వరకూ ఇట్లా నడవాలి. పోవాలి....శూన్యంలోకి అని తెలిసికూడా! ఈ నవాబు బతికితే మాత్రం... ఏం బతుకు? అంతా దగ్ధమయింది. ఇద్దరు అల్లుళ్ళు కూతురు తన కళ్ళ ముందు చీలికలై నారు. ధనం, మందిరం భస్మమైనాయి. కాని ఇంకా ఆశ. దేనికో ఈ ఆశ! అనుకుంటున్నాడు.

"అల్లా! అల్లా! ఎటువంటి వాళ్ళకు ఎట్లాంటి గతిపట్టింది ఒక్క రోజులో" అని ఏడుస్తోంది ఒకమూల, ఒక ఆమె. యిరవై యేళ్ళమట్టి ధనవంతుల ఇంటో తీరిగ్గా తింటున్న బంధువురాలు.

ఎంత స్నేహంగా వున్నారు ఇన్నాళ్ళూ! వాళ్ళ పండగలకి ప్రతి పండగకీ, వాళ్ళ తగలబెతా ఆ రాముడు, ఆ కృష్ణుడు వాళ్ళ చచ్చిన పండగలకి ధాన్యం, డబ్బూ ఇచ్చాడు మామ. ఈ హిందూ కాఫర్లలో ఎంత దుర్మార్గం, కుచ్చితం—అదేదో పేపరు చదువుతాట్ట ఆ భీమసింగ్, రహస్యంగా వినిపించాడు తక్కినవాళ్ళకి. రెచ్చకొట్టాడు...." అంటు న్నాడు ఒక చెంపతెగిన హస్సాన్.

"తురకవాడు అనేవాడు లేకుండా హిందూదేశం వూడ్చివెయ్యాలని ప్రతిహిందువుడి లోలోపలా—అని చదివాం కదూ పత్రికలో!" అన్నాడు జాగిర్ దార్.

"ఇంకా ఎంతమంది ముసల్మానులు—ఎన్ని వేలా లక్షలు...."

"అవునయ్యా! వాళ్ళ దేశంలోకి వొచ్చి, వాళ్ళని నరికి ఆక్రమించు కుని, వాళ్ళ భూసారాన్ని తిన్న పాపఫలం అనుభవించవొద్దూ!" అన్నాడు నాలుగుపరకల గడ్డం ఆయన.

వాళ్ళ భూమి? వాళ్ళ దేశం!" అని మూలిగాడు రక్తం కారు

తున్న ముక్కుతో ఒక యువకుడు. ఆ ముసలి తురకను నరికేటట్టు చూస్తో.

"ఎందుకు అసలు ఈ తగాదా! మనకీ వాళ్ళకీ అందరికి చోటు లేదూ?" అంది ఒక యవ్వనం అడ్డిపోయిన నౌకరిపిల్ల.

చల్లనిగాలి వీస్తోంది. రాత్రికి చలిగాలి అవుతుంది. ఎక్కడా ఒక్క అడ్డుకూడా కనిపించదు. ఎల్లా రాత్రి గడపడం!

సూర్యుడు ఎర్రనౌతున్నాడు.

సూర్యుడొక్కడే వాళ్ళకి దిక్సూచి, పడమటగా పోవాలి మహమ్మదీయ రాజ్యంలోకి.

ఆ పడమట మన ముసల్మాన్ రాజ్యమా! వాళ్ళు మనమీద దయగా వుంటారా!" అంది సౌందర్యవతి.

"ఆ" అన్నాడు దీనంగా అన్న.

కాని అందరికీ సందేహమే.

ఎవరో ఆ ముసల్మానులు, వీళ్ళని ఆదరిస్తారని ఎందుకు తలచాలి. తినడానికి గోధుమలు లేని కాలంలో:

రైలుకీ, కాలవకీ దూరం వాళ్ళ పల్లెటూరు. లోకంలో ఏం జరుగుతోందో దూరంగానన్నా తెలీదు వాళ్ళకి. ఎక్కడో లండన్‌లో ఢిల్లీలో జరిగే సంభాషణ ఫలితాల్ని అనుభవించడం తప్పితే.

"అసలు సరైన దోవన పోతున్నామా?"

మంచి సందేహం వొచ్చింది. ఆ సందేహాన్ని గట్టిగా రానిస్తే ఇంకేంలేదు. ఇక్కడ చావడమే మంచిది.

"పడమట అదేగా? అటే పోతున్నాము" అని సూర్యుడి కేసి చూస్తున్నాడు. ఆ పెద్ద ఎర్రపడే సూర్యుడికేసీ యూసఫ్.

"చూడు చూడు....అదేమిటి ఏదో గుంపు! హిందువులు, హిందువులు!" అని అరిచాడు వాళ్ళ ఇంటి కావిలివాడు.

గుంపులో కల్లోలం. ఈ కాస్త ప్రాణాలతో బతకనీరు గావును. మెహరీనిస్సా. ఇంతవరకు రహస్యంగా వుంచిన తన ప్రేమను దాచు కోడం మరచిపోయి అమనుల్లాను కావిలించుకుని వొణుకుతోంది.

దిగులుగా, స్థిరంగా పడమటికేసి చూసే యజమాని వాళ్ళని కావిలించుకొని ఏడుస్తున్నాడు సిద్దీ. "ఏం చెయ్యను? మీ కోసం ఏం చెయ్యను?" అంటున్నాడు మూలుగుతో!

పైగా వీళ్ళ వెనకగా తూర్పునించి ముగ్గురు మనుషులు వొచ్చారు. ముగ్గురూ యువకులు. బుజాన మూటలు వేసుకుని నవ్వుకుంటో వొస్తున్నారు బీడీలు కాలుస్తో. వీళ్ళతో కలిసిందాకా ఎవరూ చూడలేదు వాళ్ళని. ముసలమ్మ ముందు చూసింది వాళ్ళని.

"అరే, అరే, చూడండి" అని అరిచింది భయంతో.

వాళ్లు ముసల్మానులని గుర్తించారు.

"ఎక్కణ్ణించి?" అన్నాడు హస్సాన్.

"లాహోరు."

"ఎక్కడికి?"

"ఏట్లోకి" అని చేదుగా నవ్వాడు వాళ్లలో పొట్టివాడు.

"మీరో?" అన్నాడు ఇంకో అతను.

"అల్లా చెప్పు తీసుకు కొట్టాడు మమ్మల్ని, హిందూ సువ్వర్లు తరిమిన కుక్కలం" అన్నాడు సిద్దీ!

"అవును. దేశమంతా ఇంతే—ఇదే హత్యాకాండ, ముసల్మాన్ పురుగుని బతకనివ్వ తలుచుకోలేదు హిందూ ప్రభుత్వం" అన్నాడు లావాటి వొస్తాద్!

మూడో అతను ఆశతో ఆడవాళ్ళకేసి చూస్తున్నాడు.

"లాహోరులోనూ అంతేనా?"

"దేశమంతటా ఆసేతు హిమాచల పర్యంతమూ అని చెప్పలేదా?"

"మరి ముసల్మాన్లు ఏం చేస్తున్నారు? మనకింక దిక్కులేదా?"

"ఉండండి, ఉండండి. ఎంతకాలం నిద్రపోతాడు దేవుడు?"

"ఈలోపల మనకి ఎక్కడ రక్షణ!"

"పదండి, పోతున్నారుగా పాకిస్థాన్, పాకిస్థాన్ జిందాబాద్!" అని అరిచారు ఆ ముగ్గురూ.

"పాకిస్థానేమిటి? అంటోంది వెనకనించి పెద్ద ఇల్లాలు. నగలూ, బిందెలూ, చీరెలూ, అత్తర్లూ, గేదెలూ, కూర్మాలూ మాత్రమే లోకమంటే అర్థం ఆమెకి మొన్నటివరకూ.

"గాంధీ, నెహ్రూ, పటేల్ ముగ్గురు సైతాన్లు ముసల్మాన్ రక్తం తాగుతున్నారు. ఏ వూళ్ళోనైనా సరే ఠాణాదగ్గిర వొప్పగించిన ప్రతి ముసల్మాన్ తలకీ వంద రూపాయలు బహుమాన మిస్తున్నారు" అన్నాడు ఆ కొత్త పొట్టిమనిషి.

ఒక్కపెట్టున అక్కడి గుంపంతా రొమ్ము బాదుకుని గోలుమని ఏడ్చారు.

ముందు సూర్యుడి బింబంలోనుంచి ఆ గుంపు దగ్గిరగా నడిచి వొస్తోంది.

"నీళ్లు ఉన్నాయా?" అని ముఖం అవతలికి తిప్పుకుని అడిగింది ఆ కొత్తవాళ్ళని ఏడ్చి గొంతుకి ఎండి ఒకామె; అందరికన్న బిగ్గరగా ఏడ్చిన ఆమె.

స్త్రీలు ముసుగులు వేసుకోడం కూడా మరచిపోయారు. పర పురుషుల ముందు.

"ఇక్కడే నదీ వుండాలి; ఇక్కడ ఆగారేం? ముందుకు రండి" అన్నాడు ఆ ముగ్గురిలో లావాటి మనిషి.

"రాత్రి అక్కడే విశ్రమించవొచ్చు" అన్నాడు రసికుడు.

"ఇంకా ఎంతదూరం పాకిస్థాన్ ?"

"దగ్గిరే, రండి, రేపు సాయంత్రంలోపల...."

ఎదురొచ్చే గుంపుని చూసాడు "లాలూ" మాట్లాడే అతని భుజం మీద చెయ్యేసి.

చాలా పెద్ద గుంపు.

"ఎల్లాగూ తప్పదు. రండి ఎదురు పోదాం" అన్నాడు లావాటి వొసాద్.

ఆడవాళ్ళని బాగా వెనకగా వొదిలి ముందు నడుస్తున్నారు మొగ వాళ్లు.

భూమిదృష్టిని వొదిలి సూర్యుడు మబ్బులకి రంగులు వేసే ఆటలో నిమగ్నుడై నాడు.

సమీపిస్తున్న గుంపు దూరంనుంచే వీళ్ళనిచూసి "ముసల్మానులు !" అని అరిచింది.

వెంటనే ఆ అరుపుతో కలిసి "కాఫర్లు !" అని అరిచారు ముసల్మాన్లు.

ఒక్క నిమిషంలో వొస్తున్న హిందువులగుంపు తాము మోసు కొస్తున్న మూటల్ని, గేదెల్ని, కుక్కి-మంచాలలో మనుషుల్ని కిందపారేసి ఇటూ అటూ పరుగెత్తింది. ఆడవాళ్ళతోసహా, తిండిలేక, రెండురోజుల నుంచి ఎండిన ముసల్మానులు, చప్పున ఏమూలనించో, మూలగల్లోంచి, క్రోధాన్ని, బలాన్ని పైకిలాగి ఒక్కదూకున వెంబడించారు పెద్ద పెద్ద అరుపులతో.

యూసఫ్ మొదట రక్తబలిని అర్పించాడు. అస్తమిస్తున్న అరుణ కిరణుడికి, కాషాయమైన బురకావేసుకున్న ముసలిగడ్డపు బికారిని వెనక నించి తరిమి, అతని చేతిని పట్టుకు పరిగెత్తుతున్న కన్యనైనా గమనించక కత్తితో భుజంపైన కొట్టి కృతఘ్న ప్రజ్ఞుడైనాడు.

"నాన్నా" అని అరిచి కన్య ఆ ముసలి నెత్తురులో తడిసింది.

తన పరుగునైనా ఆపక ముందుకు పరిగెత్తాడు తక్కిన శరణార్థుల కోసం యూసఫ్.

చూస్తుండగా సుడిగాలికి ఎగిరిన ఆకుల మల్లే రెండు గుంపులూ మాయమైనాయి. చెల్లా చెదురై ఒకరి నొకరు తరుముతో.

నేలతోపాటు గాలికూడా కాంతిలో ఎఱనయింది.

అరుపులు దూరంనుంచి....

నాలుగు పరకల గడ్డమతను పడిపోయిన ముసలి భిక్షకుడి దగ్గిరికి వొచ్చాడు విచారంగా. ఆకాశాన్ని ఏమీ ఎరగని గాజుకళ్ళతో చూస్తున్నాడు కారుతున్న నెత్తురులోపడి ఆ దిక్కుమాలిన ముదుసలి.

"నాన్నా, నాన్నా" అని అతని రొమ్ముమీద పడి రొమ్మదర ఏడుసోంది ఆ పిల.

ముసల్మాన్ స్త్రీలు అరుస్తున్నారు! "చంపండి. చీల్చండి, వీళ్ళకి దేవుడులేడు. గుండెల్లేవు. మనుషుల్ని. పసిపిల్లల్ని పీక్కుతినే సైతాన్లు" అంటో ఏడుస్తో.

ఒకత్తె జుట్టు విరబోసుకుని "రండి రండి" అంటో దూకింది వాళ్లు పరిగెత్తి వొదలిన ఆ కుక్కిమంచాలమీదికి. ఒకదాంటో ఒక ముసలిరోగి, వెనక వదలలేక కొడుకూ, అల్లుడూ, ఎనభైమైళ్ళు మంచంలో వేసి, తీసు కొచ్చిన ముసలమ్మ, ఒక మంచంలో కాలు తెగిన పదహారేళ్ళ యువకుడూ, మూడో దాంట్లో బాలింత. ఆమె పాపతోపాటు తక్కిన తల్లుల ముగ్గురు పిల్లలు.

ముసల్మాన్ స్త్రీల కళ్ళలో, గోళ్ళలో, రెండురోజుల కిందటి దృశ్యపుదారుణరక్తపుచారలు. కాకులమల్లే, రాబందులమల్లే అరుస్తో వొచ్చి పడ్డారు. ఆ నిస్సహాయుల్ని పీకారు. కళ్ళు పెరికారు. ఆ యువకుడు చప్పున తనమీదపడ్డ ఇద్దరు యువతుల పీకలూ నులుముతున్నాడు.

ముగ్గురు స్త్రీలు బాలెంతపైన పడ్డారు. ఆమె బలహీనంగా పీకుతోంది వాళ్ళ మొహాల్ని. పసిపిల్లలు చిరునవ్వులు నవ్వారు ఆ అందమైన ముసల్మాన్ స్త్రీల ముఖాలుచూసి.

చల్లగా ప్రశాంతంగా వాయువు వీస్తోంది. పిల్లల్ని నలిపి విసిరి పారేసింది నలుగురుపిల్లలమాత. తనముందు మొన్న కెవ్వుమని అరిచి చచ్చిన తన శిశువు ముఖం తలుచుకుంటో.

పారిపోయిన హిందువుల్లో ఒక అతను ఎటునించి తప్పించుకుని వొచ్చాడో చప్పున యీ ముసల్మాను స్త్రీలమీద పడి, ఇటూఅటూ కొట్టి పరిగెత్తాడు వాళ్ళ రక్షణార్థం వొస్తున్న జాగీర్దారుని చూసి, జాగీర్దార్ కత్తి విసిరి అతని వీపున పెద్ద రక్తపుచారగా నరికాడు.

ఈ లోపల నాలుగు పరకలగడ్డం సాయెబు దెబ్బతిన్న భిక్షకుడితో ఆ పిల్లతో మాట్లాడుతున్నవాడు అటువొచ్చిన జాగీర్దారుని రమ్మని సౌజ్ఞ చేశాడు. ఆ మైదానానికంతా ప్రభువైన రాజఠీవితో, ఎర్రనికత్తి, గొప్ప వొంటిచాయ, అరుణిమ విశాలనేత్రాలు, నల్లటిగడ్డం, అజానుబాహువు, అతను వెళ్ళి నిదానంగా వింటున్నాడు ఆ జాగీర్‌దార్, హిందువులకు జరుగుతున్న శాస్తికి ఉబ్బొంగుతో.

"ఎందుకు మమ్మల్ని కొట్టారు ? ఎందుకు చంపుతున్నారు ? మేము మిమ్మల్నేం చేశాము ?" అంటున్నాడు గడ్డమాడిస్తో దెబ్బతిన్న ముసలి భిక్షకుడు.

"ఓరీ ద్రోహీ ! అబద్ధాలకోర్ ? ఎంతమంది ముసల్మానుల్ని నరికావురా ? మమ్మల్ని బతకనీరటగా, తురకవాణ్ణి లేకండా వూడుస్తారటగా ? ఏంచేశారా ? రా, వొచ్చిచూడు మావూరు, చూడు ఆ ఆడవాళ్ళని. చూడు ఆ పిల్లల్ని !...." అంటో ఓ తన్ను తన్నాడు. చచ్చే ఆ ముసలివాడి డొక్కలో.

"షేమా? షేమా?"

"మీరే! నువ్వే! నీ వాళ్ళే! నీ కుక్కలే.

"లేదు. ఈశ్వరసాక్షిగా లేదు. మే మేమెరగం ఒక్క హిందు వుడూ ఏమీ చెయ్యలేదు...."

నవ్వుతున్నాడు పడమట అస్తమించే సూర్యుడు, తూర్పు వేపు మబ్బుల్లో మొన్నటి ముసల్మాన్ రక్తపు ఎరుపునుచూసి.

"మహమ్మదీయులే, హిందువుల వూళ్ళపై పడ్డారు. ఆడవాళ్ళని ఎత్తుకుపోయారు. మొగవాళ్ళని నరికారు. నా కొడుకుని నాయెదుట నిలువునా మంటపెట్టి కాల్చారు. ఏం చెయ్యలేదు మేము, దైవసాక్షి ఏ మెరగం."

"నిజమా! ఎక్కడికి పోతున్నారు?"

"తూర్పుకి హిందూ పంజాబుకి."

"హిందూ పంజాబా! పంజాబంతా ఒకటికాదా?" అన్నాడు నాలుగు పరకల సాహేబు.

"కాదుట. అందుకనే ఈ ఘోరం. నరుకుతున్నారు. హిందూపురుగు లేకుండా నరుకుతున్నారు. "

"నాన్నా! నాన్నా!" అని యేడుస్తోంది కన్య. ఆమె కంఠం చుట్టూ వున్న ముసలివాడిచెయ్యి వేళ్ళాడుతోంది. కళ్ళకి పొరలు కమ్ముతున్నాయి.

"సాహెబ్ నా మాటలు నమ్మండి, మమ్మల్ని ముసల్మానులు తరిమి వెళ్ళకొట్టారు. మావూరికంతా మేమే మిగిలాం....మమ్మల్ని చంపారు. మీరు. మీకేం అపకారం చేశాం? మీరు మాత్రం ఏం చేశారు? కర్మ. కర్మ, కర్మ...."

ఒక్కనిమిషం ఊపిరి తీసుకుని, జాలిగా కూతురివంక చూశాడు.

"సాహెబ్! దైవం నిన్ను దీవిస్తాడు, నేను పోతున్నాను. ఒక్క సహాయం చెయ్యి, నీ పాదాలు పట్టుకుంటాను. ఆ కత్తితో నా కూతురు తల నరుకు!"

విస్మితుడై, నిస్తబ్ధుడై చూశాడు జాగీర్‌దార్.

"ఏమిటి! ఎందుకు? ... నిజమా నీ మాటలు?"

"నిజం కాకపోతే, మావూళ్ళు వొదిలి ఎందుకు ఇట్లా వొస్తాం. దైవసాక్షి నమ్మండి."

ఎందుకు హింసించారు ముసల్మాన్లు మిమ్మల్ని!"

"ఏమో! మాకేంతెలుసు? మొగవాళ్ళందరూ పొలానికిపోయారు. వొచ్చిపడ్డారు. దోచుకుపొండి, తీసుకుపొండి అన్నారు ఆడవాళ్ళు, హర హరా! ఏం చెప్పను. పసిపిల్లల్ని మానభంగం చేశారు. గుర్రాలమీద వేసుకు తీసుకుపోయారు, అరుస్తున్న ఆడవాళ్ళని. ఇళ్ళ మంటలుచూసి పరిగెత్తు కొచ్చారు మొగాళ్ళు. అప్పటికే పోయినారు ముసల్మాన్లు, మొగాళ్ళకోసం మళ్ళీ వొస్తామని బెదిరిస్తో. మమ్మల్ని అడక్కుండా, పలకరించకండా, ఇల్లామీద పడ్డారు మీరు. మీముఖం చూస్తే నాకు గౌరవం కలుగుతోంది. ఎందుకు మనుషులు అకస్మాత్తుగా ఇట్లా పులులూ, తోడేళ్ళూ ఐనారో తెలీదు....దీన్ని చంపండి. నా చేతులలో బలముంటే నేనే చంపుదును. ఎల్లాగో రక్షించుకు వొచ్చాను దీన్ని, నా కాలం మూడింది. ఎవరుదిక్కు దీనికి? వొస్తారు మీ వాళ్లు....వాళ్ల వొచ్చారా, నా ముత్యాన్ని, నా కూతుర్ని....నేనూ, చూశాను ఆడదాన్ని ఏం చేస్తారో!"

ఏడ్చాడు.

చప్పున జాగీర్దార్ ముసలివాడి రొమ్ముమీదపడి ఏడ్చాడు.

"దాదా భయపడకు. అల్లామీద, కొరాన్‌మీద, ప్రమాణం చేస్తు న్నాను, నేను మాట ఆడి తప్పను. నా కంఠంలో ప్రాణం వుండగా నీ కూతురుకి ఏ ఆపదా రాదు.

"దాని మతం...."

"ఏం భయపడకు. నీ కూతురు నాకూతురు, నా హిందూకూతురు." అన్నాడు.

ఆకాశంలో పువ్వులు నవ్వాయి.

నాల్గుపరకల తురకతను ఒక్క అరుపు అరిచాడు. ముసలివాడి చివరిసరకల్ని దిగులుతో చూస్తూన్న జాగీర్దార్‌మీద దూకాడు ఒక పీల యువకుడు ఒక నాటుబల్లెం పట్టుకుని, జాగీర్దార్ చప్పున వెనక్కి తిరిగాడు. బల్లెం అతనిభుజాన్ని కొంచెం పక్కగా దూసుకుపోయింది. చొక్కా ఎర్ర పడ్డది. ఆ ఒక్క హిందువుని మెడపట్టుకుని "ఏంచేద్దాం" అన్నట్లు చూస్తు న్నాడు అతను.

చచ్చిపోతున్న ముసలి అతను "భగవాన్" అన్నాడు.

జాగీర్దార్ బల్లెం దూరంగా పారేసి, హిందువును వొదిలి "ఇస్లాం" అన్నాడు.

క్రమంగా పరుగెత్తినవాళ్ళు ఇద్దరు ముగ్గురుగా చేరుకుంటున్నారు పారిపోయిన హిందువుల్ని లాక్కుని. కొందరు దోవలో వాళ్ళని జుట్టు పట్టుకుని తంతున్నారు. నడవలేనివాళ్ళని యీడుస్తున్నారు కిందపడేసి.

బాగా సాయంత్రమయింది హిందువులు మూలుగుతో, బెదురుతో, విరోధులవంక చూస్తో పడివున్నారు కుప్పగా మైదానం మధ్య.

"ఏంచేద్దాం వీళ్ళని!" అన్నాడు అమానుల్లా.

పసిపిల్లలు బలహీనంగా "కేవు కేవు" మంటున్నారు.

"అయ్యా, హజరత్, నన్ను చంపెయ్యండి. బాధ భరించలేను" అన్నాడు కడుపులో కత్తిపోటుతిన్న మనిషి.

"నిన్ను? నిన్ను చంపుతామా? అప్పుడే! పాపభర్మడా— చెక్కుతాం నిన్నూ, నీవాళ్ళనీ, మా ముసలివాళ్ళనీ, పసిపిల్లల్ని నరకడమనుకున్నావా? అనుభవిద్దురుగాని, రాత్రంతా ముక్క ముక్కలుగా నరికి బలిపెడతాం చచ్చిన మావాళ్ల ఆత్మశాంతికి."

"మేమా? మే మెవరిని నరికాం?" అన్నారు నలుగురు, ముగ్గురు.

"వీళ్ళనా, వీళ్ళని ముందు చర్మం వొలవండి. వాళ్ళ మాటల్లో ఉప్పూ కారం ఉందేమో తియ్యండి" అంది ముసల్‌మాన్ ముసలమ్మ" దవడచీలిన మనిషి కష్టంగా,

"నన్ను చంపెయ్యి, చంపెయ్యి" అని పక్కనున్న మనిషిని అడుగుతున్నాడు డొక్కలో పోటుతిన్న కాందిశీకుడు.

"చూడు, దయలేదా? కొడుకా, నిన్ను నా చేతుల్తో పెంచాను. నన్ను తగలేస్తావనుకున్నాను. ఒరే నీ చేతులతోనే చంపు. భరించలేను ఈ బాధ. నీ కడుపున...." అని ఆగాడు, తన కొడుకు మాత్రం ఎక్కడ మిగులుతాడు ?

జాగీర్‌దార్ ఆజ్ఞకోసం కాచుకుని ఉన్నారు గావును. అతని దృష్టి వీళ్ళమీద లేదు. తన హర్మ్యం, తన తోటలు, తగలబడ్డ తన ఊరు, తన కళ్ళఎదుట చచ్చిన తన పిల్లలు... కసి, కసి, కసి... ఎట్లా ఆ కసిని భరించడం? కసిని చూపడానికి మనుషులు దొరకడంతో ఆ కసి విజృంభించింది. బలి తీసుకోకపోతే కసిదేవతకి శాంతిలేదు.

కాని, ఆ పెద్ద మైదానం, మతం, కులం, వివక్షత లేకుండా అందర్నీ కలిపే గాలి, ఆకాశంనించి దేవతలు భూమికి వర్షించే శాంతమైన సంధ్యాకాంతి, ఇంక వేరు ప్రాణి కనపడనిచోట, ఈ కూడుకున్న ప్రాణుల మధ్య మిగిలిన మానుషత్వం, సోదరత్వం ఏమూలో వాళ్ళ హృదయాలలో అడుగునించి ఏం పని చేస్తోందో ఎవరికి తెలుసు? ఈ కాందిశీకులు నిర్దోషులనీ, ఎవరినీ చంపలేదనీ, తమకి ఘాతకం చేసినవాళ్ళకీ, వీళ్ళకీ ఏ సంబంధమూ లేదనీ, ఎక్కడో ఆలోచనల మడతలలో చీకట్లో స్ఫురిస్తోంది గావును.

కాని, కసి....కసి.

"నీళ్లు, నీళ్లు" అంటున్నాడు డొక్కలోనించి నీళ్ళమల్లే కారుతున్న నెత్తురు మనిషి. కాలు తెగిన కొడుకు పాకుకుంటూ వెళ్ళి నీళ్ళ తోలుతిత్తి తండ్రి నోటి కందిస్తున్నాడు.

(20)

ఆ దృశ్యంతో చప్పున మేలుకుంది తురకలలో నీటిదాహం, రక్త దాహం. చప్పున యూసఫ్ ఒక్కదూకుతో ఆ కొడుకుమీద పడి నీళ్ళతిత్తిని లాక్కొని తన నోట్లో పెట్టుకున్నాడు. దాంతో అందరికీ రేగింది నీళ్ళవెర్రి. ఇంకా ఆ తండ్రి నీళ్ళకోసం నోరుతెరుచుకునేవున్నాడు. రక్తం గడ్డకట్టిన కళ్ళని తెరవడం చేతకాక.

ఆడవాళ్ళతోసహా "నీళ్ళు, నీళ్ళు," అంటూ తోసుకుంటూ కిందపడి వున్నవాళ్ళని తొక్కుతూ, తంతూ ఏ ఆలోచనా లేకుండా, తల్లి కూతుళ్ళు, పెద్దలు, పసిపిల్లలు ఎగపడ్డారు. జాగీర్‌దార్ యూసఫ్ దగ్గిరికి వెళ్ళి చంప మీద కొట్టి, ఆ తోలుతిత్తి తీసుకున్నాడు. తన తండ్రేనా కొట్టింది అని విభ్రమపడి నుంచున్నాడు యూసఫ్, కోపం అవమానం మండిపోతూ. జాగీర్‌దార్ కష్టంతో వొంగి నీళ్ళడిగిన కాందిశీకుడి నోట్లో నీళ్ళుపోశాడు. ఆ తిత్తిని అట్లా పట్టుకుని నుంచున్నాడు ఆలోచిస్తూ.

సూర్యుడు అస్తమించాడు. ఆకాశం ఎరుపు పోయింది. ఆ చీకట్లో ఆ తిత్తిని పట్టుకుని జాగీర్‌దార్ అమితంగా ఔన్నత్యాన్ని పొందినట్టు ఫీలయాడు. కారణంలేకుండా అందరి కళ్ళూ అతనిపై నిలిచాయి. దేవత్వమే అతని కళ్ళలో మెరిసినట్లయింది.

రెండో ముసల్మాన్ ముసలమ్మ, జాగీర్‌దార్ పినతల్లి, "అయ్యో, నా కొడకా!" అని ఒక్క అరుపు అరిచింది. ఆ అరుపు సిగ్నల్ లాగు తురకలు అమాంతం, నిరాయుధులైన హిందువుల మీద ఉర్రుతలై, కింద పడివున్న దౌర్భాగ్యులపైన విరుచుకపడ్డారు. దబదబ బాదేశారు. అరుపులు ఏడుపులు, రక్తం, జాగీర్‌దార్ ముందున్న స్త్రీ తన నోట్లో నుంచి దెబ్బకి రాలిన పళ్ళని రక్తంతో ఉమ్మేస్తోంది. ఆమె పక్క కుర్రాడు, ఎందుకు ఎవరు తనని కొడుతున్నారో అర్థంకాక. "నాన్నా నాన్నా" అని అరిచాడు. ఆ నాన్న నడుంమీద తగిలినదెబ్బతో స్పృహ తప్పి పడ్డవాడు తెప్పరిల్లుతో, "నాయనా, సుమేర్" అని హీనంగా అంటూ

మళ్ళీ పడిపోయాడు. ముస్లిం ఆడవాళ్ళు కదులుతున్నారు తమ గర్భశోకాలకి, రక్తంతో శాంతి తెచ్చుకుందామని.

“ఆగండి” అని అంబోతురంకె వేశాడు జాగీర్‌దార్.

ఒక్క నిమిషం అతను గమనించలేదు ఏం జరుగుతోందో. ఈ దృశ్యం అలవాటైపోయింది. ఎవరి నెవరు నరుకుతున్నారో నిజంగా ఇది జరుగుతోందో, కలో, ఈ రెండు రోజుల్లో ఇంతరక్తం తాను చూడడం నిజమో, కాదో అర్థంకాని స్థితిలో పడివున్నాడు ఇంతసేపూ.

జరుగుతున్న ఘోరం అర్థమయిం తరవాత “భేష్” అంది అతని లోపలి కసి. ఆ కసినిమించిన తన సహజ ఔన్నత్యాన్ని, న్యాయాన్ని, పాపభీతిని అతను ప్రయత్నించి పైకి తెచ్చుకుని అరవాల్సి వొచ్చింది.

చప్పున ఆగారు.

కాని, అమానుల్లామాత్రం తదేకదీక్షతో, శస్త్రవైద్యుడివలె, తన బాకుతో, అప్పుడే పమిట వేసుకున్న బాలికని కిందతోసి, కనుగుడ్లని తాటిముంజలలాగు పైకి పెకలిస్తున్నాడు. జాగీర్‌దార్ ఒక్క గంతువేసి ఒక్కతన్నుతో అమానుల్లాని పక్కకి పడవేశాడు.

“వినండి, ఆగండి, మనం చేస్తున్నపని ఘోరం. వీళ్ళు మనకేమీ అపకారం చెయ్యలేదు. ఏ ముస్లింకీ హానిచెయ్యలేదు. వీళ్ళని ఎందుకిట్లా హింసిస్తున్నాము మనం? మనపిల్లల్ని నరికింది వీళ్ళా! మన ఇళ్ళని కాల్చింది వీళ్ళా?”.

ఆగాడు.

“వీళ్ళవాళ్ళే.”

“ఈ హిందూ సువ్వర్లే”

“చాతనైతే వీళ్ళు మనల్ని నరక్కుండా వొదలుతారా?”

అన్నారు యోధులు.

కాని వాళ్ళకంఠంలో ద్వేషబలం సన్నగిలింది ఆలోచనలతో కసి కొంత తీరడంచేత.

చీకటి నాలుగు మూలల్నించీ పైకిలేచి ఆకాశాన్ని అలుకుతోంది. శనేశ్వరుడు నెత్తిమీదనించి తొంగిచూస్తున్నాడు. పక్కల్నించి కీచు కీచు మంటున్నాయి పురుగులు పొదల్లో.

"చూడండి, ఒకవేళ మనకన్న బలవంతులై యీహిందువులు మననే ఇట్లా హింసించారనుకోండి. ముసల్మానులమనే కారణంతో. మనకే మని పిస్తుంది? "హిందువులవల్ల ఇంత హింసపడి, దిక్కులేక ఎడారినపడ్డ నిర్దోషుల్ని మనని, ఎవరో ముసల్మానులు వారిని హింసించారని, మనల్ని అన్యాయంగా మూర్ఖులై చిత్రవధ చేస్తారా ఈ హిందువులు అని ఏడ్చి వుండమా?'' అన్నాడు నాలుగుపరకల గడ్డమతను.

క్రోధం కింద, బాధకింద, మూర్ఖపు చీకట్లకింద అణగివున్న న్యాయ భావం చాలాగట్టిగా, ఆలోచల్ని చీల్చుకుని తలెత్తడం ప్రారంభించింది. ఏదో దయ, సానుభూతి, తాముచేసిన పనికి సిగ్గు—అట్లా నుంచుని చూస్తు న్నారు. ప్రతివారికీ ఏదో పరిహారం చెయ్యాలని, దయ చూపాలని, సోద రత్వం కలుపుకోవాలని అనిపిస్తోంది. కాని, కార్యరూపంలోకి తీసుకు రావడం ప్రతి వారికి అభిమానమయింది.

పూర్తిగా చీకటయింది హిందూ ముసల్మానుల రూపం భేదం కూడా తుడిచేసి దయతో ప్రాణికోటిని ఐక్యంచేసింది అంధకారం.

కిందపడేసి కొడితే దిమ్మతిరిగి సగంప్రాణం పోయిన హిందూ పసి పిల్ల తెలివొచ్చి బిగ్గరగా ఏడ్చింది. మూలుగుల శబ్దాల్నిమించి, చప్పున చాంద్‌బీబీ ఆ పిల్ల నెత్తుకుని, రెండు రోజులనించి తాగడానికి పిల్ల లేని తన స్తనాన్ని యీ తల్లిలేని హిందూపిల్ల నూట్లో పెట్టింది. ఆ గొప్ప నిర్వ్యాజమైన అనురాగంతో, ద్వేషపుగట్లు తెగినట్టు, ముసల్మానులు దెబ్బతిన్న హిందులపై పడి, కట్లుకట్టేవారు, గాయాలు తుడిచేవారు,

ఆ తిత్తిలో నీరు కొంచెం, కొంచెం. తాగించేవారు— ఆ దృశ్యం నక్షత్రాల వెనుకనించి దేవతలే సఫలతతో చూస్తున్నారనిపించింది.

"నిన్నిక్కడ కొట్టానా?"

"కాలు విరిగిందా? ఫరవాలేదు, నయమవుతుంది."

"ఏడవకు. దేవుడున్నాడు. భారం అతనిమీద వెయ్యి."

మోసుకునిపోయి మెత్తని స్థలాల పడుకోపెట్టే ముసల్మానుల మెడలచుట్టూ చేతులువేసిన హిందువుల్నిచూస్తే, ఆ వైరం, ఆ ఘాతుకం వుత్త దుస్వప్నంలాగు తోచింది.

రాత్రి పదింటికి చల్లగా చంద్రోదయమయింది. చచ్చిపోయిన భిక్షకుడికన్య, జాగీర్‌దార్ కాళ్లపడుతోంది. దోలీలో తీసుకొచ్చిన హిందూ యువకుడికి స్మృతివొచ్చింది, ఆ చల్లగాలికి. అతనికి ఓ కాలు పూర్తిగా విరిగిపోయింది వాళ్ళవూళ్ళో దెబ్బలాటల్లోనే. అతన్ని ఇన్ని మైళ్ళు మోసుకొచ్చారు. అతను కళ్లతెరిచి ఈ దృశ్యాన్నంతా వింతగా చూశాడు.

"దాహం, దాహం."

అమానుల్లా ఒక్కరవ్వ నీళ్ళిచ్చాడు.

"ఇంకలేవు" అన్నాడు.

"ముసల్‌మాన్" అన్నాడు యువకుడు.

"మా నాన్న ఏడి!" అన్నాడు మళ్ళీ.

"ఇక్కడ వున్నాను నాయనా" అన్నాడు కొంచెందూరంనించి తల పగిలి మరణిస్తున్న తండ్రి.

"వున్నావా? ఇంకా వున్నావా?" అన్నాడు క్రూరంగా కొడుకు.

"తెల్లారేటప్పటికి వుండను."

"ఏమిటి? వీళ్లెవరు?" అన్నాడు యువకుడు.

చెప్పారు సంగతి.

"బాగా జరిగింది. ఎంత బతిమాలి చెప్పాను మీకు. ఇళ్ళువాకిళ్ళను వొదిలి కదలవొద్దని. ఎందుకు ఆదేశించాడో నా గురువు, సర్వజ్ఞుడు. ఆయన మాటకి బద్ధులంకావడమే మనక్షేమమన్నానా? స్పృహతప్పిన నన్ను మోసుకొచ్చారు ఫలితం అనుభవించారు" అని పళ్ళుకొరికి ఏడవడం ప్రారంభించాడు.

"గురువేమిటి?" అన్నాడు హుస్సేన్.

ఇంకోఆయన అంటున్నాడు. ఆ యువకుడి బావ "గాంధీ" ఆ గాంధీని చూడనన్నాలేదు మావాడు. కొడుతున్నా, కాలుస్తున్నా, ప్రతీకారం కూడదన్నాడట ఆయన. మావూళ్ళోకొట్లాటల్లో శాంతం, శాంతం అంటూ అడ్డంవెడితే కాలు విరిచారు వీడికి. వాణ్ణి విడవలేక, కుక్కి సవారీలో బుజాలు పడిపోయేట్టు. ఇంతదూరం తీసుకొస్తే. మధ్య దోవలో మమ్మల్ని తిట్టి దాంటోంచి దూకాడు గురువు ఆజ్ఞ అంటూ. ఎక్కడవున్నవాళ్ళు అక్కడే చావండి. కాని కదలవొద్దన్నాట్ట, వీడి గురువు. చిన్నప్పుడు "కాసబియాంకా" పాఠం చదివాం. ఆ గతే పడుతుంది ఇల్లాంటివాళ్ళకి, అని వాడి ధోరణి."

"గాంధీ తిరిగి హింసించవొద్దన్నాడా? మరి ప్రతి ముసల్మాన్ తలకీ వందరూపాయలు బహుమానం ఇప్పిస్తున్నాట్ట?" అన్నాడు జాగీర్‌దార్.

"ఆఁ, ఆఁ, ఎవరు ఆ మాట అన్నది? వాడి తల బద్దలుకానూ— వాడి నాలిక వీలికలుగానూ. ఎవడు అన్నది?" అంటూ లేవబోయి కూల పడ్డాడు యువకుడు.

"శాంతం, శాంతం" అన్నాడు జాగీర్‌దార్.

నివ్వెరబోయి చూశాడు ఆ యువకుడు గడ్డపు జాగీదార్ని. కాళ్ళ పట్టే యువతినీ, ముసల్‌మాన్ నోటినించి శాంతం ఇస్లాం!

"అవును. ఈ కేకలూ, ఈ క్రోధం, తన మంచి పేర్లుకోసమైనా సరే, అపరాధమేనంటాడు నా గురువు నా గాంధీ...క్షమించండి.

కానీ, ఎవరన్నది ఆ మాట? పరమ అసత్యం. గాంధీ? గాంధీని ఎట్లా అనగలిగారు ఆ మాట! ఎవరు తెలియని సోదరుడు ఆ అసత్యాన్ని పలికింది?"

"పీళ్ళు—" అని చుట్టూచూశారు.

ఆ తూర్పునించి వొచ్చిన ముగ్గురు యోధులు లేరు. ఎప్పుడు వెళ్ళిపోయారో!

ఆకాశం చల్లని మంచుతుప్పరల్ని రాల్చింది గాయం చేసుకున్న తన పిల్లలమీద.